1938 జూన్




## తిరువాంకూరు - కాంగ్రెసు సభ్యురాండ్రు

'గృహలక్ష్మి'కి ప్రారంభము నుండియు తిరువాంకూరన్న నొక విధమగు ప్రత్యేకాభిమానము. తిరువాంకూరు రాష్ట్రమును, ప్రభుత్వమును, పరిపాలకులను అభినందించుచు 'గృహలక్ష్మి' ప్రతి సంవత్సరము ఎన్నేని వ్యాసముల ప్రచురించుచున్నది.

కారణము సుస్పష్టము.

స్త్రీలకు సంఘమున నున్నతస్థానమును కలిగింప కంకణముగట్టుకొని కృషి చేయుచున్నది 'గృహలక్ష్మి'.

అనాదినుండియు నఖిలభారత దేశములో హిందూ సంఘమున స్త్రీలకు పురుషులకంటె ఉన్నత స్థానమిచ్చినది, ఆధునిక పద్ధతుల నవలంభించి స్త్రీల సర్వతోముఖాభివృద్ధికి పాటుబడుచున్నది తిరువాంకూరు.

ఈ పత్రిక ఈ రాష్ట్రమును అభినందించుటలో విశేషము లేదు.

దానికి వ్యతిరేకముగా నసమ్మతిని జూపుచు వ్రాయుట విశేషముగును; ఐనను అది విధియుగూడ నగును. ప్రకృత మటుల వ్రాయవలసి వచ్చినందులకు మిగుల విచారించుచున్నాము.

మిస్ ఆనీ మాసరీన్ తిరువాంకూరుసందొక న్యాయవాదిని; తిరువాంకూరు సంస్థాన కాంగ్రెసు సంఘ నిర్వాకసమితి సభ్యురాలు. ఆమె ఇటీవల ప్రకటించిన తన యనుభవములు దారుణముగనున్నవి. దానికి బాధ్యులము గామని తిరువాంకూరు ప్రభుత్వ మన వచ్చును. అది సహజమే.

స్త్రీలంద రత్యున్నతిని గౌరవమును బడయు నాచారమె స్థిరముగ నెలకొని యున్న ఈ సంస్థానములో విద్యావతియు, బాధ్యతవహించిన పౌరురాలునగు ఆనీవంటి వారట్టి పరిస్థితులకు లోనగుట ఆశ్చర్యముగ దోపకమానదు.

దీనికి కారణ మామెయే చెప్పినది.

కాంగ్రెసు సభ్యురాలయినప్పటినుండియు నామెస్థితి విషమించినది. సంస్థానములందు కూడ స్వాతంత్ర్య సమరమును అహింసాపద్ధతుల మూలమున కొనసాగింప నెంచుకొన్న కాంగ్రెసు విధానమును సంస్థాన ప్రభుత్వమువా రాటంకపెట్టుట సహజమే.

అయిన నీ స్వాతంత్ర్యోద్యమము నూతనము కాదుకదా? చెలరేగుచున్ననిన్ని దినములూరకుండి సంస్థానములు ఇపుడు కాంగ్రెసు వాదులకిట్టి పరిస్థితులు గలిగించుటెందుకు?

సంస్థాన సంఘములకు మునుపటివలె తోడ్పడజాలమని అఖిలభారత కాంగ్రెసు ఎపుడు తీర్మానించెనో నాడే సంస్థాన కాంగ్రెసు వాదులస్థితి యూహింపదగియుండెను. ఇపుడు వారది యనుభవించుచుండుటలో విచిత్రమేమియు లేదు.

అయినను వెనుక సహాయములేదని సంస్థానము లీ విధముగ కాంగ్రెసు వాదులను—అందున స్త్రీలను—హింసకు గురిచేయుట శ్లాఘనీయమైనదికాదు. నేరమొనర్చిన వారికి బహిరంగముగ తగుశిక్ష విధింపనగును. అంతియగాని వారిని ఆనీ విధముగ దుర్భర పరిస్థితులకు లోనుచేయుట తగనిది. వారు దీనికి బాధ్యులము గామన్నచో నికమీదటనైన తమ సంస్థానమునందట్టి స్త్రీలకిట్టిబాధలు కలుగకుండునటుల చూడవలసియున్నది.

మిస్ ఆనీ మాసరీన్ తన యనుభవములనుగూర్చి పత్రికలందీ విధముగ ప్రకటించినది. "పూర్వాచారముగ వచ్చుచుండెడి స్త్రీ గౌరవము సంస్థానమున తృణీకరింపబడుటకు కాంగ్రెసు సభ్యత్వమే తగినకారణముగ గన్పడుచున్నది. తిరువాంకూరు సంస్థాన కాంగ్రెసు కార్యనిర్వాహకసమితిసభ్యురాలనైనప్పటినుండియు నాకు గలిగిన యనుభవమది. నేను సమితి సభ్యురాలనైనకొలది కాలమునకే ఏకాకినిగా చేయబడితిని. అనగా ప్రభుత్వ సేవకులుగానున్న నా సోదరియు, నా సోదరుడును నాకు దూరముగ బదలీ చేయబడిరి. ఇక నాతో మిగిలినది వృద్ధురాలగు నా తల్లి మాత్రమే.

నారాయణపిళ్లైగారి రాజద్రోహపు కేసున అపరాధి పక్షమున నేను పనిచేసిన తరువాత నా పరిస్థితి మరింత మార్పు చెందినది. పిళ్లెగారిని జైలువఱకు వెంబడించి యిల్లుచేరిన అరగంటకే నా యింటిపై శిలావర్షము గుఱిసినది. నాపై గుఱిపెట్టబడిన రాయి కిటికీ తెరను జొచ్చుకొని నాకాలికి తగిలినది. వెంటనే దీనినిగూర్చి దివానుగారికిని, పోలీసుకమిషనరుగారికిని వ్రాసితిని. ఇంతవఱకు దానినిగూర్చి యెట్టి విచారణయు చేసినటుల కనపడదు; అసలది గమనించినటులే లేదు.

ఇప్పటి నాస్థితి మరింత దుర్భరమైనది. ఏప్రెలు 29 వ తేది శుక్రవారము రాత్రి

నాయింటగల వస్తువులన్నియు దొంగలు దోచుకొనిపోయిరి. దుస్తులు, డబ్బు, నగలు, సన్నదు, డిప్లొమా, సర్టిఫికేట్లు ఇంకను విలువగల కాగితములన్నియు పోయినవి. సుమారు తెల్లవారి మూడు గంటలకు నాగదిలో టార్చిలైటు వెలుతురుపడి నన్ను మేల్కొలిపెను. నావైపు త్రిప్పబడిన టార్చిలైటు పట్టుకొని యెవడో నాయెదుట నిలుచుండి యుండెను. నేనులేచి 'నీ వెవరని' యాతని ప్రశ్నించితిని. అతడు పరుగిడెను...

నాయింటగల నాలుగుపెట్టెలు దొంగలింపబడెను. వానిలో నగలు మొదలగు వెలగలవస్తువు లున్నవేగాక భోజన పదార్థములు, సామానులు, దినజీవితమున కగత్యమైన వస్తువులున్నవియు గొనిపోబడెను. స్టాండుమీదగల మాసినగుడ్డలు పనికిరాని సామానులగదిలోని పెలికలుగూడ దొంగలు విడువలేదు. గాలికై సగము తెరువబడిన కిటికీకమ్ములనువంచి తద్వారా దొంగలు లోనికి ప్రవేశించిరి. వేకువను 3-30 గంటలకు పోలీసు ఇన్‌స్పెక్టరుగారగు లతీఫు యిల్లు చేరితిని. వారిని నిద్రలేపుటకు కొంత కాలము పట్టినది. కంటోన్‌మెంటు పోలీసు స్టేషనుకు వెళ్లమని వారొక సేవకుని తోడుగ నిచ్చిరి. ఇన్‌స్పెక్టరుగారింటికి వెళ్లు దారిలో దోచబడిన పెట్టెలలో రెండు కాళీపెట్టెలను రోడ్డుమీద చూచితిని.

నాలు గంటలకు ఠాణా చేరితిని. పరిసరములందుగల ఠాణాల కన్నింటికి యీ సమాచారము వెంటనే టెలిఫోను చేయవలసినదని ఇన్‌స్పెక్టరుగారు తమ సేవకునితో చెప్పియుండిరి. ఠాణాయందుగల పోలీసుతో నేనే ఆ విషయమును చెప్పితిని. వారు కావలసినంత అశ్రద్ధచూపిరి. వారు టెలిఫోనుగల గదిని తప్పించి దానికొఱకై ఇతర గదులన్నియు వెదకిరి. తుదకు వెంటనే ఫోనుచేయని పోలీసును ఒత్తిడిచేసితిని.

ఫోనులో నంబరు చేర్చుటకు కాన్‌స్టేబిలు పదినిముషములు దీసికొనెను. అతడు యీ సంగతి ఇతర ఠాణాలకు తెలుపబోవుచుండగా ఇన్‌స్పెక్టరుగారేవచ్చి ఫోర్టు స్టేషనుకు ఫోనుచేసిరి. తరువాత వార లచటి పోలీసుకు నన్ను నాజ్మూల మిమ్మనిరి.

పోలీసు ఆ తరువాత పెన్సలు చెక్కుట కరగంట గడపెను. వాజ్మూలమెటుల దీసికొనవలయునో నింకొకరి సలహా నడుగుచు మరి పది నిముషములు గడపెను. అంతట నే నతనితో 'అయ్యా! వాజ్మూలమిచ్చునది నేనే. న్యాయవాదిని కూడాను. అందుకు మీ సలహా అక్కర లేదు. నేనుచెప్పినది వ్రాసికొనిన చాలును' అంటిని. నామాట నెగ్గలేదు. పూర్వాచారముల నతిక్రమించుట కతని కిష్టమున్నటుల గన్పడలేదు. తుదకది ముగియుటకు ఉదయము ఆరుగంటలైనది 'మీరు వెళ్లండి, ఇపుడే మీయింటికి వత్తుము' అని వారనిరి. కాని వారు మాయింటికి వచ్చుట పదిదాటిన తరువాతనే.

దోపిడి విధానము మిగుల విచిత్రమైనది. నాయింటగల ప్రతి గుడ్డపేలికను గూడ దీసి

కొని పోవలయునని దొంగ ప్రత్యేకశ్రద్ధ వహించినటుల దోచుచున్నది- పెట్టెలందు కావలసినంత సరుకుగలదు. సాధారణ దొంగ వానితో తృప్తిజెందియుండును. కాని యీ దొంగ మాసినగుడ్డలను, పనికిరాని పేలికలను కూడ దీసికొనిపోయెను. తదనంతరము మాకు—తల్లికూతుండ్రకు మిగిలినవి రాత్రి దుస్తులు మాత్రము. అదృష్టవశాత్తున కాంగ్రెసు ప్రచారమునకై వెళ్లియుండి నేను శుక్రవారము సాయంత్రమే యింటికివచ్చితిని. నా ప్రయాణసంచి నేను దీసికొనిపోయి యుండిన రెండు చీరలతో నాపరుపుప్రక్కననే యుండెను. దొంగ టార్చితో నచటికి వచ్చియుండెనుగాని నేనంతలో మేల్కొని దాని నతనికి దక్కనీయనైతిని. ఇటుల జరగనిచో నేను ఇన్స్పెక్టరు ఇంటికి వెళ్లుటకే సాధ్యమయి యుండెడిదికాదు.

దొంగ ఇంటినుండి బైటికిపోవునపుడు అతని నడుములో నేదియో వ్రేలాడుచుండెను. కనుకనే అతడు కిటికిగుండా వెళ్లుట మానినాడు. మాయింట కట్టెలుచీల్చు గొడ్డలియొకటి యుండెను. అవసరమున్న దానినే ఆయుధముగా నుపయోగింతమని దానితో నాగది ప్రవేశించి యుండెనేమో!

ఈ నీచకార్యమున నొకడుకంటె యెక్కుడుమంది యుందురనుట నిజము. వారు కేవలము ధనాపేక్షచేతనే రాలేదు. వారి యుద్దేశము వేరు. ఆ రాత్రి ప్రక్కదేవాలయమునందుత్సవము జరుగుచుండెను.

శనివారమురాత్రి నేను మెయినురోడ్డుపై నడచుచుంటిని. ఇటీవలనే జరిగిన పోలీసు పందెములందు పాల్గొన్న ఒక కానిస్టేబిలు సైకలుమీద నావెనుకవచ్చి నాపేపురు ఢీకొని తన తుంటరితనము నెరవేర్చినందుకు నవ్వుచు వెళ్లిపోయెను. అతని చొక్కాకు ఎఱ్ఱగ 18 వ నంబరు కుట్టబడియున్నది... ఈ సందర్భమున తిరువాంకూరు స్త్రీలు కాంగ్రెసు సంస్థకు సర్వతోముఖముగా తోడ్పడ కంకణబద్ధులు గావలయునని వేడుచున్నాను. ఇచటి పరిస్థితు లీవిధముగ విపరీతములగుట కవకాశమిచ్చినచో ఇచట స్త్రీల కనాదిగాగల గౌరవమునకే క్షణముననో భంగము గలుగకమానదు. ఇది నా యనుభవము. తిరువాంకూరు సంస్థానమందు గల స్త్రీలందరు ఏకగ్రీవముగ హక్కులకై నిలువబడవలెను. అపుడుగాని ప్రజలకు బాధ్యులైన ప్రభుత్వవర్గ మేర్పడదు. అపుడుగాని స్త్రీల మొరలు వినిపించుకొనబడవు."

ఆనీ గావించిన ప్రకటననుగని అందు సత్యేతరములగు విషయములున్నవని తిరువాంకూరు ప్రభుత్వమామెను క్షమాపణ గోరుకొమ్మన్నట్లు తెలియుచున్నది. సత్యేతర విషయముల ప్రకటించుట నేరమేయగును కాని ప్రత్యక్షానుభవముల సత్యేతరములని ఎవరనగలరు? అట్టి విపరీత సంఘటనలకు కారణములేమో ప్రభుత్వమువారు శ్రద్ధగ విచారించి నేరస్థులను గనిపెట్టి దండించి స్త్రీల గౌరవమర్యాదలను గాపాడినచో నిట్టి ప్రకటనలకసలు చోటే ఉండదు. అనాది నుండి స్త్రీలకున్నత స్థానమిచ్చుచున్న తిరువాంకూరు ప్రభుత్వము ఏపరిస్థితులందుగాని దానికి భంగము కలిగింపదని దృఢముగ విశ్వసించుచున్నాము. —25-5-38.

# మనసులో మాటలు

శారదాబిల్లు మళ్లీ వచ్చిందిట—

ఇప్పుడు పిల్లలకు పెళ్లిళ్లుచేస్తే కద్దు లేక పోతే యికముందు చేసినట్లైతే పోలీసువాళ్లు తమంతటతామే వచ్చి కొంపమీదపడి పెళ్లిళ్లు చేసినవాళ్లను కోర్టుకు యీడ్చుక పోయి శిక్ష వేయిస్తారుట; అన్నమాట యెట్లాపుట్టిందో తెలియదు. క్షణంలో దేశమంతటా అల్లుకుపోయింది. ఇకనేముంది ప్రజల్లో మళ్లీ తెక్కలిపుట్టింది. శారదా బిల్లేమిటి? మళ్లీ రావడమేమిటి? మునుపున్న స్థితి యేమిటి? యిప్పుడు జరిగిన మార్పే మిటి? ఇది యెవరికి వర్తిస్తుంది? ఇప్పుడున్న పిల్లలకు ముడిపెట్టంగానే యేమవుతుంది? ఇకముందు పుట్టబోయేవాళ్ల నేమి చేస్తా మన్న ఆలోచనలేదు. మళ్లీ మొదలుపెట్టారు గొంతుకోత. రోజులపిల్లలకూ నెలలపిల్ల లకూగూడా దినదినమూ నిరాతంకంగా పెండ్లిండ్లు జరిగిపోతున్నాయి. ఈ ఉత్సా తం యింకా యెప్పటికి ఉపశమిస్తుందో తెలియదు.

ఆలోచనావిహీనమైన యీ తల్లిదండ్రుల అజ్ఞానప్రవర్తన చూస్తే దుఃఖం వస్తున్నది. ఇది యెప్పటికైనా నివారితం అవుతుందా అని భయంగూడా వేస్తున్నది. శారదా చట్టం యెవరి శ్రేయంకొఱకు చేయబడ్డదో ఆ పిల్లలందఱికీ ప్రతిమాఱూ యిట్లా వేలం వెఱ్ఱిగా పెండ్లిండ్లు చేయబడ్డతర్వాత యిక యెవరిని రక్షిస్తుందో తోచదు.

రజస్వలాభయంచేత ద్విజులు చేస్తు న్నారు. సరేసరి; ద్విజేతరుల కేమి ప్రమా దమో తెలియదు. బ్రాహ్మణేతరులుగూడా 'గతానుగతికోలోకఃన లోకఃపార మార్థిక' అన్నట్లు పసిబిడ్డవివాహాలు చేస్తున్నారు.

ఈ వివాహసందర్భాల్లో తమ శ్రోత్రి యత్వానికి ప్రమాదం వస్తూవున్నదన్న సనాతనధర్మపరులు యీ పెండ్లిండ్లలో జరిపే అపభ్రంశాలకు లెక్కలేదు. గోడకు వెల్ల గడపకు పసుపుకుంకుమ, వాకిలికి తోరణము ముంగిలిని పందిరి. అన్నీ శూన్యం. ఏ అర్ధరాత్రివేళో నలుగురు పెద్దలు యేమాఱుమోల కొంపలోనో కూడేదీ, అభము శుభము నెఱుగని యిద్దరు పసిబిడ్డల నిద్రతో తూగుతున్నవారిని పీటల మీద కూలవేసేది, యేవో రెండు మంత్రాలు వల్లించేది, తాళిబొట్టు కట్టించేది. సరి పెండ్లి అయిపోయింది. ఈవిధంగా లాటాకు బొమ్మల పెండ్లికంటె కనాకష్టంగా అనా లస్యంగా అమంగళంగా వివాహాలు జరిగి పోతున్నాయి. తెల్లవారి యెవరు చూస్తారో కనుక పెండ్లికూతుళ్లకు కాళ్లకు పారాణి, మెడను గంధం, మొగాన కల్యాణంబొట్టు బుగ్గను చుక్కా, యేమీ అనరాదు. ఎట్లాగో మూడుముళ్లూ పడితేచాలు.

ఈసందర్భాన యీ అవకతవక అసత్య వివాహాలకు సత్యనారాయణస్వామి యెం తైనా ఆదుకుంటున్నాడు. ఇప్పుడు యెవరి

నైనా మీయింట్లో యేమి అని అడిగితే సత్యనారాయణవ్రతమని చెప్పేవాళ్లే గాని పెండ్లి అని చెప్పేవాళ్లు కానరారు. సత్యనారాయణ వ్రతమను పేరుతోనే వివాహాలూ విందుకార్డులు, బంధుమిత్రాహ్వానాలూ జరిగిపోతున్నాయి. ఆ సత్యనారాయణస్వామి యెంత అసత్యరక్షకుడో, ఎంత ఆశ్రితావనదీక్షాపరుడో, ఎంత గట్టిగుండె గలవాడో కాని తనపేర జరుగుతున్న యీ అక్రమశిశువివాహ మహాపాతకమంతా భరించి రక్షిస్తున్నాడు.

పూర్వం యీ పెండ్లిండ్లకు యే స్వదేశ సంస్థానమో పోయి చేసుకొనేవాళ్లు. యిప్పుడు ఆ చవిగూడా తీరింది. అక్కడకుపోయినా పట్టుకుంటారని తెలిసినందున యీ దండుగకూడా యెందుకని యింట్లోనే గుట్టుగా చేసివేస్తున్నారు.

ఈవిధంగా శారదాచట్టం బిగించిన కొలదీ సళ్లు వదులుతున్నది. ఈసళ్లు లేకుండా యీ శిశువివాహ మహోపద్రవం శాశ్వతంగా తొలగవలెనంటే దయగలవారికి ఒకటేదారి కనిపిస్తున్నది. పూరూరా శారదాచట్టప్రచారకసంఘాలు నెలకొల్పి బాల్యవివాహాలు జరుగబోయేముందు ఫలానావారి పిల్లలకు బాల్యవివాహం చేయబోతున్నారని సంఘంపక్షాన కలెక్టరుకు తెలియపఱచడం, ఆయనద్వారా కన్యాజనకులకు నిషేధఉత్తరువు పంపించడం, జరగాలి. అటువంటి ఉత్తరువు పూరికి రెండు మూడు అందజేయబడెనా అంటే ప్రజలు కిక్కురుమనకుండా పిల్లి తిరిగే యింట్లో యెలుకలు అణిగిఉన్నట్టు శ్రోత్రియులంతా అణిగిఉంటారు. పసిబిడ్డలకు రక్షణ కలుగుతుంది.

అప్రశస్తమైన యీ శిశువివాహాల్లో స్త్రీల బాధ్యత యెంతైనావున్నది. స్త్రీలు తమ మంచి తాము యెరిగిఉన్నట్లైతే పురుషులెంత శ్రోత్రియులైనా అవుదురుగాక తల్లి పమిటకొంగుల్తో దోబూచులాడే పసిపాపలకు వివాహం చేయగలిగేవాళ్లేనా? గొడ్డలి యెంతవాడిగలదైనా ఒక చెట్టుయొక్క కొయ్య దానికి పిడిగా చేయబడకపోతే మరొక చెట్టును కొట్టగలుగుతుందా?

మంచి బిల్లు—

భారతదేశబాలికల సుఖమయజీవితాలను దుఃఖబహుళంగా చేస్తున్న నిర్బంధ దురాచారాల్లో వరకట్నా లొకటి. ఇది అధికవ్యయకారకమైన ఆంగ్లవిద్యవల్ల యిరువదవ శతాబ్దారంభలో నాటబడిన కొంగ్రొత్త విషబీజం. ఆంగ్లవిద్య నేర్వడంవల్ల యువకులకు గొప్ప ఉద్యోగముః హోదా లభిస్తూవున్న రోజుల్లో ధనాఢ్యులైనవారు అట్టివారికి పిల్లనిస్తామని ఉరుకులెత్తుతూ కొంత వరదక్షిణ యివ్వడంతో ఈ ఆచారం మొలకెత్తింది. ఈమొలక క్రమక్రమంగా వృద్ధిబొంది బీదా బక్క అన్నమాటా లేకుండా అన్ని మతాలకు అన్ని వర్ణాలకూ వ్యాపించింది. వీటితోబాటు ఎన్నో లాంఛనాలు నడుతులు తోడైనాయి. పెండ్లి

కొడుకుతోబాటు వారి తల్లులూ తోబుట్టువులూ శుల్కం స్వీకరించే అధికారులైనారు. ఇప్పు డది వరదక్షిణ గాదు, వరకట్నం గాదు, నిర్బంధశుల్కం. ఈపన్ను చెల్లిస్తేనే గాని యిప్పు డే యువకవీరుడూ బాలిక మెడలో పుస్తెకట్టడు. ఇప్పు డాతని కా బాలవిద్యావయోరూపాలతో లేశమూ అవసరములేదు. డబ్బే అతనికి ముఖ్యం. ఇప్పుడు కట్నంలేకుండా తన కొమారుడికి వివాహం చేస్తాననే పెద్దమనిషి యేసంఘంలోనూ కన్పడడు.

ఆంగ్లవిద్యవల్ల లభించే ఉద్యోగాలూ హోదాలూ యేనాడో వెనుకపట్టిపోయినాయి. నేడు యింగ్లీషుముక్కలు వచ్చినవా డున్నంత సంపాదనకు కొఱగాకుండా మెవడూలేడు. అయినా కట్నాలబిగువు సడలలేదు. బాలికల వివాహం గొంతుమీద కత్తివంటి గండకత్తెరపని కావడమే యీబిగువు సడలకపోవడానికి కారణం. ఈ కట్నాలవల్ల యెందఱో తండ్రులు శుష్కదరిద్రులౌతున్నారు. ఎందఱో బాలికలు బలవన్మరణాలపాలవుతున్నారు. ఎన్నో సంసారాలు దుఃఖభాజనమై పోతున్నాయి. అయినా ప్రజలలో వివేకోదయం కలుగలేదు. ఈ దురవస్థ చూచి బీహారు శాసనసభవారు వరకట్నాల నిషేధించు బిల్లు పెట్టారు. ఈబిల్లు శాసనమైతే వరుడు కట్నంక్రింద 151 రూపాయలకంటె యెక్కువపుచ్చుకోగూడదు. ప్రజలు తమ వివేకజ్ఞానంవల్ల సంస్కరించుకోవలసిన లోపాలు రాజశాసనాలవల్ల నిషేధింపజేసుకోడం దురదృష్టమనే చెప్పవలసివచ్చినా యీరూపంగానైనా యీ కట్నాలతీవ్రత తగ్గితే యెంతో సంతోషింపవలసిన విషయమనడానికి సందేహంలేదు. మద్రాసు శాసనసభకూడా యిటువంటి చట్టం త్వరలో చేసినట్లైతే ప్రజలు యెంతో సంతోషిస్తారు.

కనుపర్తి వరలక్ష్మమ్మ.

# దసరా సంచిక

## సుప్రసిద్ధాంధ్ర రచయిత్రీమణులకు

**మామూలు**

అక్టోబరు మొదటి తేదీ యథాప్రకారముగా గృహలక్ష్మి దసరాసంచిక వెలువడనున్నది. దీనిని నొకమారు ఆంధ్రరచయిత్రీమణులకు జ్ఞాపకము చేయుచున్నాము.

**మనవి**

దసరా సంచికను సర్వాంగసుందరముగా వెలువడుటకుసుప్రసిద్ధాంధ్ర రచయిత్రీమణులతోడ్పాటును గృహలక్ష్మి కోరుచున్నది. వారు దానినిమరువక చిత్తగించగలరు.

వ్యాసములు వివిధవిషయములకు సంబంధించినవై పద్యగద్య గేయములతో గూడినవై యుండవచ్చును. ముఖ్యముగా కావలసిన కొన్ని సమస్యలను క్రిందయిచ్చుచున్నాము.

- ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు స్త్రీ లేవిధమున తోడ్పడవలసియుండును?
- సాంఘికస్థితి బాగుపడుటకు అత్యవసరముగా కావలసిన చట్టములెవ్వి?
- ఊరూర స్త్రీసమాజములను స్థాపించుటకు అవి నిరంతరాయముగా జరుగుటకు మార్గములెవ్వి?
- గృహలక్ష్మిని దైనికజీవితములో ఎదుర్కొను సమస్యలు—వాని పరిష్కార పద్ధతులు.
- వయోజనవిద్య స్త్రీలలో అభివృద్ధిపొందుటకు చేయదగు కృషి.
- పొదుపుగా సంసారముచేసుకొనుటకు సలహాలు—ఆచరణలో పెట్టదగినవి.
- గృహశిక్షణ—పిల్లల సంరక్షణ—వారి చదువునకు స్త్రీలు తోడ్పడనగు విధానము.
- ఎటువంటిరచనలు స్త్రీల అభ్యుదయమునకు తోడ్పడును?

ఇంకా ఇటువంటివానిపై

**వ్యాసములు**

క్లుప్తముగ, నాలుగు పుటలకు మించక, సరళమైన భాషలోనుండవలెను. వచనరచనకెక్కుడు ప్రాముఖ్యమండును.

అన్ని వ్యాసములు ఆగస్టునెలాఖరులోపల మా కందవలెను.

వ్యాసములపై 'దసరా సంచికకు ప్రత్యేకము' అనియుండవలెను.

సంపాదకుడు.

# ఎవరి దోషం?

శ్రీ రాజారావుగారు

"అమ్మా వీణా! వద్దుసుమీ, నీవు అడియాస పెట్టుకుంటున్నావు. ప్రపంచమంతా ఎన్నివిధాలగా అనుకుంటున్నారో వినడం లేదు? తీరా వాళ్ల తండ్రిగారు ఒప్పుకోనక పోతే నీ జీవితం అధోగతి పాలైపోతుంది. తండ్రిమాట జవదాటలేక నీజీవిత కుసుమాన్నితన్ని పారేసి మరో అమ్మాయిని వివాహంచేసికుంటాడు. అప్పుడు నీ గతేమాతుందో ఆలోచించుకో. శతవిధాల చెప్పుతున్నాను. తర్వాత నీయిష్టం" అన్నది కూతుర్ని మందలిస్తూ, తల్లి విజయలక్ష్మి. చావడిలో యెవరూలేరు తల్లీకూతురూతప్ప. చంటిపిల్లలు ముగ్గురూ దొడ్లో ఆడుకుంటూన్నారు.

"అమ్మా, అనుభవం ఉన్నవారు మీరే యిల్లాంటి మాటలాడుతున్నారా? మీరెరగనిదేమున్నది? అది అసాధ్యం. క్షమించండి. అయినా యిప్పుడా గోడవెందుకు? నా అదృష్టం యలావుంటే అలాగె అవుతుంది" అన్నది వీణ స్త్రీ సహజమయిన సిగ్గు నభినయిస్తూ. వికసించిన కలువల్లాంటి కళ్లు "ఆ ప్రసంగం యిప్పుడువద్దు"అని అతిదీనంగా వేడుకుంటూన్నట్టు కనిపిస్తూన్నవి.

"వీణా, నీకు ప్రపంచానుభవంలేదు. అతి మధురాలైన నీ అభీష్టాలన్నీ నెరవేరుతే జీవితం స్వర్గతుల్యమే అవుతుంది. కాని వాటికి యేకొంచెం అటూయిటూఅయినా జీవితం దుర్భరం అవుతుంది. నేను చెప్పుతూంటే వేరే అభిప్రాయపడి ఆ ప్రసంగాన్ని యిప్పుడు తోసివేస్తూన్నావు. కాని నిన్ను కనిపెంచినందుకు మావల్ల దోషంలేకుండా చెబుతూన్నాం. నీ అభీష్టానికి వ్యతిరేకంగా మేమెప్పుడూ అనుసరించము కాని మా విధ్యుక్తధర్మంగా మేము చెప్పవలసిన మాటలు చెప్పడం మావిధి. ఆతర్వాత కష్టసుఖాలు నీవి. కనుక నిశ్చయించుకో" అన్నది విజయలక్ష్మి.

ఈ ప్రసంగానికి ప్రత్యుత్తరం యివ్వడం వీణకు చేతకాలేదు కండ్లవెంబడి నీళ్లుగిఱ్ఱున తిరిగినై. ఈ విషయం ఎత్తినప్పుడల్లా ఆ అనుభం మామూలే. కాని యిక సహించలేక పోయింది.

"అమ్మా, ఆయన తలిదండ్రుల్ని ఒప్పించే పూచీ తనపైన పెట్టుకొని నాకు అభయహస్తమిచ్చారు." అన్నది. ఈ మాటలంటూండగానే అతి మధురమైన తలపులు మెరుపులా మెరిసిపోయినట్లు, సిగ్గుపడి యిక మరితలెత్త లేకపోయింది వీణామయి.

"అమ్మా, ఆయనకు నీయందు అవ్యాజమయిన ప్రేమున్నదని నేను సందేహించడం లేదు. అతి గంభీరమయినప్రేమ నీమీద ఆయనకుండి యుండవచ్చు. కాని ధనికులైన వారి తండ్రిగారు మీ యిర్వురి వివాహానికి యిష్టపడతారని నేను నమ్మలేకపోతున్నాను. ఆయన యెంత ప్రయత్నించినా తండ్రి అనుమతించకపోతే వివాహం జరగడం అనిశ్చయం. మాటలు వ్యవహారానికి

అదృష్టాలు. వాగ్దానం ఆచరణలో పెట్టడం సులభంకాదు. ఆయన తండ్రి లక్షాధికారి. ఈయన స్వతంత్రజీవితాని కవసరమయిన విద్యార్హతలనింకా సంపాదించలేదు. అంతేకాదు 'తండ్రిని అనుమతింపజేస్తా'ననే కాని, ఆయన అంగీకరించకపోతే యేమి చేయాలో యింకా ఆలోచించడంలేదు. నిన్ను బలవంతపరచి నీమనస్సు మార్చుదామని మా ఉద్దేశ్యమేకాదు. కాని, అనుభవము లేమిచేత నీవు ఆలోచించక విడిచిపెట్టిన విషయాల్ని నీకు స్ఫురింపజేయాలని నా అభిప్రాయం. ఆయనతండ్రి యిష్టప్రకారం వివాహమాడితే మహదైశ్వర్యాలు అరచేతిలో వుంటవి. ఆయన యిష్టపడనినాడు ఆ భోగాలువిడచి నిరుపేద జీవనానికి సిద్ధపడి నిన్ను చేపట్టుతారని నేను నమ్మను. మార్గమంతా అనుకూలంగా ఉన్ననాడు ప్రేమను పోషించడం అతిసులభం. కాని, "When poverty Comes in at the door love flies out through the window" అని దరిద్రదేవత గుమ్మంలోంచి లోనికి ప్రవేశిస్తే, ప్రేమ కిటికీద్వారా అంతర్థానమవుతుందట. ఆనాడు ప్రేమను పోషించడం కష్టసాధ్యం సుమా. అయినా దూరం ఆలోచించుకో" అన్నది విజయలక్ష్మి సహజమయిన మాతృప్రేమ శాంతం అనుభవం ప్రతిమాటలోను వెల్లివిరుస్తూరుంటే.

ఇక యీమాటలకు ప్రత్యుత్తరం యీయలేకపోయింది వీణ. తలక్రిందకువంచి నిశ్శబ్దంగా వూరుకుంది.

* * *

"మాఅమ్మ అలా అన్నారు."

"అవును ఆమె అలా అనడంలో తప్పేమీలేదు. దూరం ఆలోచించుకొమ్మని చెప్పితే తప్పేముంది? మాతృసహజమైన ఆదుర్దాతో ఆమె హృదయంలోగల భయమామె తెలియజేసింది. కాని యికనేను చెప్పవలసినదున్నది. మానాన్నగారు మన వివాహానికి అంగీకరించని పక్షంలో నేను నిరుపేదనై పోతాను. ఆనాడు నీవు నన్ను తిట్టినా విధిని తిట్టినా కార్యంలేదు."అయ్యో సుఖధామాని వివాహమాడిన ఆగర్భశ్రీమంతుడు దరిద్రుడైపోతాడని యెరుకలేక యింత చేసికొన్నా"నని నీవు విచారించి లాభముండదు. కనుక చెబుతూన్నాను. వీణా, విచారించి నీవు మనసుమార్చుకొన్నా నేను విచారించను. నాకు కావలసినది నీవూ నీ సుఖమూను. నా దురదృష్టవశాత్తు నిన్ను పొందలేకపోయినా నీవు సుఖపడుతూన్నావని నేనెంతో ఆనందించగలను. ఇక నీ కొరకు స్వర్గసామ్రాజ్యాన్ని విసర్జించవలసి వస్తే నెనుదీయను. నీవు మనసు మార్చుకున్నా అందుకు కించిద్వాగ్రహం కూడా రాదు. పైగా నీ విచక్షణాశక్తికీ దూరదృష్టికీ గర్విస్తాను. కనుక అమ్మచెప్పిన మాటల్లో అర్థం గ్రహించు. మానాయనగారిని ఒప్పించేటందుకు సర్వశక్తులూ వినియోగించుతాను. వెయ్యేందుకు నీవు కానిపక్షంలో మరోకన్య నాకు భార్యకాదు.

కాని నీ సుఖమాలోచించుకో" అన్నాడు వసంత్.

"మీరలా మాట్లాడితే నాకు కోపం వస్తుంది. మీ ఐశ్వర్యాన్నిచూచి నేను మోహించడంలేదు. మీ సిరిసంపదల విషయమై యిదివరకు వినలేదు. మీ వేష భాషల్నిచూచి సుందరాకారంచూచి మీ భాషా చమత్కృతినిచూచి మేధాశక్తిని చూచి నేను మిమ్మల్ని ప్రేమించడంలేదు. అప్రయత్నంగా అహేతుకంగా నా కెరుక లేకుండానే నన్ను మీ పాదపద్మాల సన్నిధిని పరమేశ్వరుడు పడవేశాడు. మీలో Magnet ఎక్కడనున్నదీ నాలో Iron ఎక్కడనున్నదీ నేను గుర్తించలేను. కాని ప్రప్రథమంలో నేను మిమ్మల్ని కాలేజీలో చూచిననాడు భరించరాని హృదయావేదన ననుభవించాను. నేనొక కొండ శిఖరాన్నుండి లోయలోనికి చూస్తూన్నట్లూ అగాధమయిన అతి భయంకరమయిన ఆలోయలోన్నుంచి నన్ను కాలయముడు రమ్మనమని ఆహ్వానిస్తూన్నట్టు భయపడి నేను వెనుకకు పోదామని ఎంత ప్రయత్నించినా పోలేక నే నాలోయలో పడిపోతూన్నట్టు అయ్యాను. ప్రేమను ప్రేరేపిస్తూన్న ఆకళ్లలోనుంచి నా వైపు చూడవద్దు. నాకు గుండెల్లో బాధగా వుంది. మీరు కళ్లుమూసికుంటేనేగాని నేను మాట్లాడను."

"వీణా నేనెరుగుదును నా హృదంతరాళాన నీ వమృతవర్షం కురిపించావు. నా జీవితపథాన్ని ముత్యాల ముగ్గువేశావు. నాకై నీ ప్రేమతులలేనిది. నీ విసర్గసౌందర్యామృత పానానికి నే నర్హుణ్ణికాను. నీవు భగవతీ స్వరూపిణి. నిన్ను పూజాపీఠాన్ని నిల్పి ఆరాధిస్తాను."

* * *

"వసంతా వద్దుసుమా నిన్నుకని పెంచి విద్యాబుద్ధులుగరిపి పెద్ద చేశాము. ఈ మాత్రం మామాటవినవా? మేంమాత్రం నీకు శత్రువులమా? నీ సుఖదుఃఖాలతో మాకు నిమిత్తంలేదా! బాధ్యతలేని కార్యాలు మేమెప్పుడైనా చేశామా? నీ శాశ్వత సుఖంకోశం అయినయింటి అమ్మాయిని అప్సరస కన్యవంటిదాన్ని విద్యావతిని నీకు చూపించి నీసమ్మతి తీసికొని నీకు పెళ్లి చేస్తాము. నీవు సుఖపడుతూంటే చూచి మేమానందించమా? పైగా యీబాలిక నలుపట, కురచట, కులగోత్రాదులిక చెప్ప నక్కరలేదు. ఇంతేకాక కాలేజీలోనుండగా యెవరో విద్యార్థితో సంబంధమట. మా మాటవినవా వద్దు. ఇంత చక్కనిపిల్లని యింత విద్యావతిని యిలాగేవుండే మరో అమ్మాయినిచూచి పెళ్లిచేస్తాము. నీవు కోరిన సౌఖ్యాలన్నీ సమకూర్చే తండ్రిగల అమ్మాయిని చూస్తాను. మేము నీకు శత్రువులముకాము. నామాటవిను, యేమి, యేమంటావు?"

"నాన్నగారూ, మీపట్టు విడువమని కరాంజలి ఘటితమస్తకుడనై విన్నవిస్తూన్నాను. వీణను నేనెన్నటికి పరిత్యజింపలేను.

ఆమె సుకుమారహృదయమున కాలాగ్ని రవుల్కొలిపి నేను రౌరవాది నరకముల నెదుర్కోలేను. ఆమెకళ్ల నెంబడి నీరుకారిన నాకభ్యుదయములేదు. నన్ను మాత్రం క్షమించండి."

"ఓరి దుర్మార్గుడా కని, పెంచి, పెద్ద చేసిన మా మంచితనమే యింతచేసింది. నీ వాలోచించుకొనడానికి 3 దినాలు పరిమితి స్తున్నాను. ఈలోగా ఆలోచించుకొని నీమనస్సు మార్చుకొన్న విషయం నాకు తెలియజేయకపోతే నా యిల్లు విడిచి పోవచ్చు." * * *

తరువాత జరిగేఘోరాలకు కారకు లెవరు? దోష మెవరిది?

## "పరివేదన"

శ్రీ పన్యాల వేంకట రంగనాథరావుగారు

పూర్వజన్మానచేసిన పుణ్యమేమొఁ
గాని, యీనాడు నలుగురిలోనలేక
చినిగిపోయినచీరలో మునిఁగిపోయి
చీరసింగార మెఱుఁగని శీలవతివి
నీవు, నీ కేకవినువార లేరి తల్లి?

వేయికన్నాలతోగుడ్డ పేలికొకటి
ముష్టిమెతుకులఁబట్టుచు మూటఁగట్టు
అన్నికన్నాలతోనున్న గిన్నెనైన
ముట్టలేనట్టినిరుపేద వెట్టులమ్మ
బ్రతుకుచున్నావు యీముష్టిమెతుకుఁదినుచు.

అడుగునడుగున నీరసమడుగులుపడ
లేతపాదాలసాగింపఁ బోతివీవు
ఈమహాకష్టసంద్రాన నీదఁబూని,
కోమలంబైనచేతుల కొసఁగినావు
విధినిఁదూలాడి యాచన వృత్తినీవు.

నీకుసరితూగువారు రాణీలుఁగలరు
గొప్పవారలు సౌధాలఁ గులుకువారు
వారిచిన్నారికోర్కెలు ఫలముఁజెందుఁ
గాని నీకోర్కె పెద్దమ్మ కాంతిలోన
మండిపోవును నిముసాన భగ్గుమనుచు.

అపుడహల్యకు మితిలేని యందమిచ్చి
తనకుతానే పరవశాన మునిఁగినాడ
టంచుమాతాతమున్ను లిఖించినాడు
నాటి మిగిలినకోర్కెపై కోటియంద
ములతో నిన్నుసృజించి నీపూర్వజన్మ
ఫలముఁగాంచియు దుఃఖించి, వైచెనేమొ
నేఁడు కమలాసనుఁడు నిన్ను పాడుచేసి.

పూర్వజన్మానచేసిన పుణ్యమేమొఁ
గాని, యీనాడు నలుగురిలోనలేక
చినిగిపోయినచీరలో మునిగిపోయి
చీరసింగారమెరుఁగని శీలవతివి
నీవు, నీ కేకవినువారలేరి తల్లి?



జీవైక్యము



తూర్పు కృష్ణాజిల్లా మహిళాసభ
ఆహ్వానసంఘాధ్యక్షురాలు :
శ్రీమతి బులుసు ఆదిలక్ష్మాంబగారు



'ఏంతిది?___'

# గృహలక్ష్మి

## ఒకటవరంగము

నారాయణరావు పడకగది. మంచముమీద నారాయణరావు పండుకొనివుంటాడు. ప్రక్క భార్య లక్ష్మీదేవి కూర్చొని వుంటుంది. క్రిందపరచిన పడకమీద వారి బిడ్డలగు కృష్ణుడు, గోపాలుడు, సుశీల నిద్రపోతుంటారు. నారాయణరావు పచ్చని దేహచ్ఛాయతో, విశాలమైన ఫాలభాగంతో ఆకర్షణీయమైన రూపం గలవాడు. లక్ష్మీదేవి భర్తయంత ఛాయగలదికాదు. కాని మితమైన ఛాయతో చక్కనిదనే చెప్పవచ్చు.

లక్ష్మి:—ఏమండీ! పట్టెడన్నమన్నా తిన్నారు కారు. మీ మొహంచూస్తే యెంతో అలసటగా కనబడుతున్నది. ఈమనోవిచారానికి తోడు తిండి తిప్పలులేక ప్రొద్దుటస్తమానం యిలా తిరుగుతూ వుంటే మీకేదైనా జబ్బుచేస్తే మరీకష్టంకదండీ?

నారా:—అబ్బా! లక్ష్మీ! ఇవ్వాళ నేను యెక్కరాని గడపలెక్కి పట్టరానివాళ్ల కాళ్లుపట్టానే. పదిహేనురూపాయల గుమాస్తాపనికూడ ఖాళీలేక పోయింది. ఎన్నాళ్లిలా కష్టపడాలో. పట్టభద్రుణ్ణయి ప్రయోజనమేమి చెప్పు. నామాటకేమిగాని నీకండ్లు మొహం అలా వాచివుందేమే? ఏమన్నా యింట్లో దెబ్బలాడుకున్నారా? చాలా యేడ్చినట్లున్నావే?

లక్ష్మి:—ఏమీ లేదండీ.

నారా:—మాఅమ్మేమన్నా అన్నదా. మా అమ్మకు మాతమ్ముడంటే చాలాఆశ. నేనంటే అంత యిష్టంలేదులే. మానాన్నకే నేనంటే యెక్కువ ప్రేమ.

లక్ష్మి:—అలాఅనకండి. తల్లికెక్కడన్నా ఒక కొడుకుమీద ప్రేమ యింకొకరిమీద నిర్దయా వుంటుందా. తల్లిప్రేమ మీకేంతెలుసు. చిన్నవాడు గదాయని మీతమ్ముడియం దభిమానం కనబరచవంత మాత్రాన్నే యీమెప్రేమలో భేదమున్నదనుకొన్నారా. అయిల్లాలు మీస్థితికెంత కష్టపడుతున్నారో మీకేంతెలుసును. కన్నతల్లిప్రేమ బిడ్డలనుగన్న తల్లులకే తెలియాలి. ఆమెననుకుంటే పాపమండీ. ఆమేమీ నన్ననరు.

నారా:—మాతమ్ముడేమన్నా వీళ్లనందరినీ పోషించవలసి వచ్చిందని అన్నాడా?

లక్ష్మి:—పాపం ఆయన నోరుతెరవడు. నాకే చాలా కష్టంగావుండింది. మీతమ్ముడికి మీమీద అభిమానంచేత యేమీ అనరుగాని మీమరదలి కెందుకుంటుంది. ఆమెతరపు వాళ్లకెందుకుంటుంది. వాళ్లు పిల్లిమీదబెట్టి యెలుకమీదబెట్టి దెప్పుతూవుంటే నాకు బల్లాలతో పొడిచినట్లుంటుంది. మీకు చదువుకు లోటా. బంగారువంటి వుద్యోగంపోయింది. ఇక యెన్నాళ్లకు మళ్ళీ వుద్యోగమవుతుందో. మనమిద్దరం గామే. పిల్లలతో అయిదుగురమున్నాము, వాళ్లు మాత్రం యెన్నిదినాలు పోషించగలరు. పోనీ పుట్టింట్లో కొన్నాళ్లుంటామంటే తల్లిదండ్రి లేరుగదండీ. ఇదంతా తలచుకొని చాలాయేడ్చాను. ఇక మనమీయింట్లో వుండవద్దండీ. ఏదో గదిపట్టుచూచుకొని గంజికాచుకొనిత్రాగి బ్రతుకుదాము. మరదికికూడా కష్టంకలగక మునుపే పోతే మంచిది.

నారా:—లక్ష్మీ! ఎట్లా జీవిస్తామే. చేతపైసా లేదు. నీకున్న స్వల్పనగలు అమ్మేశాను. మాతండ్రి మాకాస్తి యేమీ పెట్టలేదు. ఒక్కపూట గడవవద్దా.

లక్ష్మి:—మీకుద్యోగమయ్యేవరకూ నేను కష్టపడి సంపాదిస్తాను. నాకాశక్తివుంది. ఒకరింట్లో వంట

చేస్తాను. నా రెక్కలకష్టంవల్ల గంజిఅన్నం తినలేమా. మీరు ధైర్యంగా వుండండి.

నారా:—ఇంత బ్రతుకు బ్రతికి ఆకరికి నీవు దాసీ పనిచేస్తావా? నేను తినికూర్చోనా. అంత పనికి మాలినవెధవనా?

లక్ష్మి:—అదికాదు. మీరు సోమరితనంచేత కూర్చోలేదే? పనికోసం అష్టకష్టాలు పడుతున్నారు. మనకష్టం తీరుతేనే గాని యేపదిరూపాయలపని కలసిరాదు. అంతవరకు నేను తేరతిండితిని గోళ్లుమీటుకుంటూ మీకష్టంచూస్తూ కూర్చోనా. మీకు నాచేతనైనసహాయం యెందుకు చెయ్యకూడదు. పూర్వం రాజభార్యలు సత్యభామ కైక వీళ్లంతా భర్తలను యుద్ధంలో శత్రువులచేతుల్లోనుంచే రక్షించారే. ఆదేశంలో నేపుట్టిన మేము కొంతకాయకష్టపడి భర్తలకెందుకు సహాయపడకూడదు. దుర్మార్గపువృత్తి చేసి డబ్బు సంపాదింపగూడదు గాని మర్యాదతో యేపనిచేస్తే యేమండీ? కాలంతప్పివస్తే చక్రవర్తుల భార్యలే దాసీపనులు చేసినట్లు పురాణాల్లోవినలేదా? ఇక నాకేమి. మీకష్టం చూడలేను. అవమానం సహించలేను. కాబట్టి మీరేమీ భయపడకండి. నా స్నేహితురాలు అన్నపూర్ణసహాయంవల్ల నెమ్మదిగా వేరేకాపురం పోదాము.

నారా:—సరే నీయిష్టం. బుద్ధిమంతురాలివి నీకు తెలియనిదేమున్నది?

లక్ష్మి:—ఇక పడుకోండి, అలసివున్నారు. నేను కాళ్లుపడుదునా? (లక్ష్మి కాళ్లుపడుతూవుంటే నారాయణరావుతల్లి మెల్లగా "లక్ష్మి! లక్ష్మి!"అని పిలుస్తుంది. లక్ష్మి లేచి బైటకువెళ్తుంది.)

తాయ:—బాబు నిద్రపోయాడా?

లక్ష్మి:—అత్తా! నిద్రపోయారు.

తాయ:—ఇవ్వాళ జరిగిందంతా బాబుతో చెప్పావా? వాడిది చాలా మెత్తనిమనస్సమ్మా! మీ మామగారు ధనవంతులు కాకపోయినా బిడ్డలకేలోటులేకుండా కష్టంకలగకుండా పెంచారు. రేపు తమ్ముడు చెప్పేమాటలకేమీ పాలుపోక యెంత కష్టపడతాడో భరించలేక బలవంతంగా యేదైనా తెగిస్తాడేమోనని భయంగా వున్నది. ముందుగానే నీవు చెప్తే యింకేమున్నది. తల్లీ నాబాబుగుణం నాకు తెలుసును. ఏమిగతే లక్ష్మి!

లక్ష్మి:—అత్తా! నన్నునమ్మండి. నేనేమీ చెప్పలేదు. నాకుమాత్రం తెలియదా. మీరు చూచారుగదా. ఇవ్వాళ పిడికెడు మెతుకులు తినలేదు. (కళ్లనీళ్లు పెట్టుకొంటుంది).

తాయ:—(కన్నీటితో) చూచానమ్మా! నా తండ్రి సగమైపోయాడు. నెలదినాలుగా కడుపు కన్నంతినకుండా వున్నాడు. నావంటిని చిన్నమెత్తు బంగారంలేదు. నేనెట్లా చిన్నవాడిని కాదని పోషించగలను. బిడ్డలాకే. పుణ్యాత్ములుగనుక మీమామగారు స్వర్గంచేరుకున్నారు. పాపాత్మురాలిని బిడ్డ కష్టంచూస్తూ మొద్దులాగున్నాను.

లక్ష్మి:—అటువంటిమనిషికి కష్టసమాచారంచెప్తే యేమన్నా వున్నదా. నేనొకతీర్మానం చేసుకున్నాను. మీకొడుకునికూడా వప్పించాను. అత్తా! నాస్నేహితురాలు అన్నపూర్ణయింట్లో వకగదిపట్టు అద్దెకుతీసుకొని నేనుకష్టపడి గృహపరిశ్రమలవలన దినానికేకొద్దో సంపాదించి బిడ్డలకింత గంజిపోసి మేము జీవించదలచుకొన్నాను. మీరు మరదితో "మాయింట్లోనుండి లేచిపొమ్మని అన్నగారితో చెప్పవద్దనండి. వారందినా లోర్చుకోమనండి. ఈలోపల మేము వేరుపోతాము. ఆయనతో నేరుగాచెప్తే భరించలేరు. ఆయనబాగుంటేనేగదాత్తా! మాకాధారం. మనమంతా ఆయన మేలుకోరవలసినవారమే. ఆయనకుద్యోగం దొరికేవరకూ భగవంతునిమీద భారంవేసి కష్టపడి సంపాదిస్తాను.

తాయా:—తల్లీ! పువ్వులమ్మినవూళ్లోనే కట్టె లమ్ముతావా? మీమామ ధనంలేదుగాని గౌరవంగా జీవించారు. అటువంటాయనకోడలివి ఆవూళ్లోనే వంటచేసి పనిచేసి బ్రతుకుతావా? అబ్బా యిది చూచి నేనెట్లా భరించనే?

లక్ష్మి:—మరేమీ పరవాలేదు. ఫలానావారి కోడలు వ్యభిచారి, గయ్యాళి, అని పేరువస్తే మంచిది కాదుగాని కాయకష్టంతో సంసారం గడుపుతున్న దంటే గౌరవమే లేండి. వెక్కిరించేవారేగాని మన కష్టాని కాదుకొనేవారులేరు. మీరు విచారించకండి. మీచిన్నకొడుకుతో వారందినా లోపికపట్టమనండి?

తాయా:—అట్లాగే చెయ్యితల్లీ! నీకు దేవుడే తోడు. అమ్మా కోడలివికావు. నాకూతురివి. బాబుని నీచేతుల్లో వప్పగించాను. వాడిపాలిలక్ష్మివై ఆదరించు. నాస్థితి నీకు తెలుసుగదా.

(లక్ష్మిని దగ్గరకుచేర్చుకొని ఏడుస్తుంది.)

లక్ష్మి:—(అత్తకు నమస్కరిస్తుంది) అత్తా! మీరు విచారపడకండి. నన్ను దీవించండి. మీరిక లోపలికి పొండి. ఎవరన్నా చూస్తే అనుమానిస్తారు, (తాయారమ్మ లోపలకుపోతుంది. లక్ష్మి గడితలుపువేసి బిడ్డల ప్రక్కలో పడుకుంటుంది).

* * *

రెండవరంగము

[లక్ష్మి స్నేహితురాలు అన్నపూర్ణయింట్లోచావిడి. పరిశుభ్రంగావుంటుంది. రెండేండ్లపిల్ల బొమ్మలతో ఆడుకొంటూవుంటుంది. చాపమీద అన్నపూర్ణ పువ్వులుకడ్తూ వుంటుంది. సామాన్యరూపవతి లక్ష్మి యామెవద్ద కూర్చునివుంటుంది.]

అన్న:—అక్కా! మాయింట్లో ఒకకాపురస్తులు యిల్లు నిన్ననే కాళీచేశారే. ఇల్లుచిన్నది. ఒకగది చిన్నపంచపాళి. అద్దె రెండురూపాయలు. ఎలాగో సర్దుకుంటే ఆయిల్లు బాగుంది.

లక్ష్మి:—అబ్బో ఆయిల్లేచాల్లే. తలదాచుకునేం దుకుంటేచాలు. పెద్దయిల్లయితే అద్దెయెక్కువగాదా? పనిసంగతేమిచేశావు?

అన్న:—ఈవూళ్లో నాళంవారి నెరుగుదువుగదా. వారికొక్కతే అమ్మాయి. ఆఅమ్మాయికి పెండ్లి పది హేనురోజులుంది. ఆయింటి యజమానురాలికి నాకు స్నేహం. ఎవరన్నా ఫలహారాలు చేసేవాళ్లుంటే చూడండి. వందకింతని కూలిస్తాము అని అన్నది. అరిసెలు, సున్నుండలు, కజ్జికాయలు, జంతికలు, యింకా యిలాంటివి చెయ్యాలట. అప్పడాలు, వరుగులు చెయ్యాలట. కాబట్టి నీకిష్టముంటే ఒప్పుకో. అక్కడే ఒక పెద్దావిడున్నది. ఆమెను సహాయం తీసుకో. అయితే కష్టం.

లక్ష్మి:—అన్నపూర్ణా! నీకడుపు చల్లగా మంచి పనే చూశావే. మర్యాదస్తులు. నాకు వచ్చిన ఫల హారాలు చేసియిస్తే వారిఅక్కరా తీరుతుంది. నా సంసారం గడుస్తుంది. పనిచేస్తే నీచమని యొకరికష్టార్జితంతింటూ వాళ్లదెప్పిపొడుపులువింటూ భర్తలను కష్టపెట్టి వారు కష్టపడేదానికన్న చేతనైన పనులుచేసి డబ్బెందుకు సంపాదించుకోరాదు? ఎంతకష్టమున్నా సరేచేస్తాను. నాభర్త కుద్యోగందొరకువరకు రాత్రీ పగలు కష్టపడైనాసంపాదించి బిడ్డలను పోషిస్తాను. కాని తేరతిండితిని అవమానం పొందలేను. వెంటనే నేను చేస్తానని చెప్పు. ముందు పదిరూపాయ లివ్వమను.

అన్న:—అక్కా! మీమరది రేపే మంచి దన్నారు. కాపురం రేపేరండి.

లక్ష్మి:—రేపే పనిలోకూడా ప్రవేశిస్తాను. మా మామగారి యిత్తడిసామానులు మావంతు కొచ్చినవి తెచ్చుకొంటాము. మీ బావతో సాయంత్రం చెప్పి రేపు తెల్లవారితో వస్తాము. అన్నపూర్ణా! నే నిక వెళ్లానే. నీ సహాయంవల్ల యింతవరకూ దారియేర్పడి నది. నీమేలు మరవను. ఇకపైన భగవంతుని భారము

అన్న:—నాదే మున్నదక్కా! అంతా ఆదేవుని యనుగ్రహము. నీ ధైర్యమే నిన్ను కాస్తుంది. కుంకం తీసుకో. (లక్ష్మి కుంకం తీసుకొని బిడ్డనెత్తుకొని వెళ్లి పోతుంది.)

## మూడవరంగము

[అన్నపూర్ణ యింట్లో లక్ష్మి కాపురమున్న గది కొద్దిపాటి సామానులతో పరిశుభ్రంగా చూచేందు కింపుగావుంటుంది. రెండేళ్ల పిల్ల సుశీల ఒడిలో పెట్టుకుని ముద్దాడుతూ లక్ష్మి అత్తగారు తాయారమ్మ లక్ష్మితో మాట్లాడుతూవుంటుంది.]

తాయా:—పోనీలేవే, అమ్మా. మీ కష్టంతీరింది. నా నాయన కిక నెమ్మదికలుగుతుంది. ఇన్నిదినాలకు కాలు కదుపుకు వచ్చినందుకు చల్లనిమాట విన్నాను. పద్దాకావస్తే రహస్యంగా మీకు దోచిపెడుతున్నావని నీ తోడికోడలు పుట్టిస్తుందేమోనన్న భయంవల్ల మానుకున్నాను.

లక్ష్మి:—ఆ అంతమాటా వచ్చివుండును. అత్తా! మీరు రాకపోతే మాత్రము మీ మనసులో ఎంత కష్టమున్నదో తెలుసుకోలేమా. మీ కొమారుడు యీదినమే పనిలో ప్రవేశించారట. అందుకని సాయంత్రం మీవద్దకువచ్చి చెప్పవలెననివున్నారు. ఇంతలో మీరే వచ్చారు. నాయనా! కృష్ణా! గోపాలా! మీ నాయనమ్మ వచ్చారురా రండి? (ఆడుకుంటూవున్న పిల్లలు పరిగెత్తుకొచ్చి నాయనమ్మ ప్రక్కచేర్తారు.)

కృష్ణ:—నాయనమ్మా! వచ్చావా? తమ్ముణ్ణి చెల్లెమ్మని తీసుకువచ్చావా? బాబాయి రాలేదు?

తాయా:—ఎన్నాళ్లైందిరా మిమ్మల్ని చూచి. నాయనా అల్లరి చెయ్యకుండా బుద్ధిగావున్నారా? నన్నెప్పుడైనా తలచుకొంటారా?

గోపా:—నాయనమ్మా! రోజూ రాత్రిళ్లు అన్నం తిన్నాక నాయనమ్మ మనకు కథలుచెప్పేదికదా అనుకునేవాళ్లం.

సుశీ:—నాన్నమ్మా! నీ విక్కడేవుందవూ? బాబాయి దగ్గరకుపోక.

తాయా:—నేనుంటే నాకు భోజనానికి డబ్బు కావద్దు తల్లీ.

కృష్ణ:—నాన్నకి పనైందిలే. నీ కన్నంపెట్టడానికి కష్టముండదు. లేకపోతేమాత్రం అమ్మ పెట్టదంటుందా.

లక్ష్మి:—(నవ్వుతూ) నాయనమ్మ యింక యిక్కడే వుండకపోతే వూరుకుంటానూ.

తాయా:—నా తండ్రులే. నే నెక్కడుంటే నేమి. మీరు బాగుంటే నా కదేచాలు. లక్ష్మి యిన్నాళ్లు సంసార మెట్లా గడిపావు?

లక్ష్మి:—అత్తే! మొందటినెలలో నా కంటా వారింట్లో పలహారాలవీచేసి గడిపిన సంగతి మీకు తెలుసు గదా. వారమ్మాయికి సంగీతం, యింగ్లీషు కొంతవరకు నేర్పమని కోరారు. నెలకు పదిరూపాయల జీతానికి నా రెండువిద్యలూ అమ్మాయికి చెప్పడాని కొప్పుకున్నాను. ఇంట్లో అప్పడాలు, వడియాలు మొదలైనవి చేసి లక్ష్మిస్టోరను చోట మీ కొమారునిద్వారా అమ్మించేదాన్ని. ఇరుగుపొరుగువారి గుడ్డలు కూలికి కుట్టేదాన్ని. కుట్టుపనులు చేసిన చేతిగుడ్డలు, గౌన్లు, జాకెట్లు మొదలైనవి కుట్టి ఆస్టోరులోనే అమ్మించేదాన్ని. కష్టపడవలెనేగాని వీటివల్ల చాలా లాభము సంపాదింపవచ్చును. నెల కిరవైరూపాయి లీవిధంగా సంపాదించేదాన్ని. చారూ అన్నానికి లోపంలేకుండా గడుపుకొస్తూవుంటిని. రెండు నెలలగా మీ కొమారుడుగారు రెండిండ్లలో ప్రయివేటు చెప్పుచు పది రూపాయలు సంపాదించుచున్నారు. దేవుడు మా మొరాలకించినందున మీ ఆశీర్వాదబలంవల్ల మీ కొమారునికి నేషనల్ బ్యాంకులో యిరవైయైదు రూపాయలు గుమాస్తా పని నేటికి దొరికింది. ఇక ఫరవాలేదు. పంచభక్ష్య పరమాన్నాలు లేకున్నా, పట్టుపీతాంబరాలు లేకున్నా, వెలగల నగలు

భాగ్యాలు లేకున్నా కడుపునిండా అన్నానికి కట్టుకోను బట్టకు లోటులేకుండా సుఖజీవనం గడపవచ్చు. ఇంతమాత్రంగా జీవితం గడపుమని నిత్యం ఆ దయామయుని ప్రార్థిస్తూవుంటాను. మరది గారికొచ్చే స్వల్ప జీతంలో మే మింతమంది తింటూవుంటే పాపం కష్టం గదా. మా మంచికే మరది గారిచేత అన్నిమాటలా డేవుదనిపించాడు. సంసారమనే బండికి భార్యా భర్తలు రెద్దులవంటివారు. ఒక రెద్దు పండుకొని రెండవ రెద్దుమాత్రమే బండిలాగుతే బండి నడుస్తుందా చెప్పండి. మీకొడుకు మొదటంత కష్టపడ్డారు కాని యిప్పుడు నేను చేసిన పని మంచిదే నంటున్నారు.

తాయా:—అమ్మా! నిజమే నీవు బుద్ధిమంతురాలవు. గనుక నీవు నేర్చిన విద్యలన్నీ కష్టసమయంలో వుపయోగపరచి కష్టం గడిపావు. అందరూ అలా చేస్తారా. అబ్బాయి రావడం ఆలస్యమవుతుందా.

లక్ష్మి:—అదుగో మాటలోనే వచ్చారు. నూరేండ్లాయుస్సు.

నారా:—అమ్మా! ఎంతసేపైందే వచ్చి. నేనే వస్తామనుకుంటున్నాను. (అని తల్లిని పలకరించి కోటు తలగుడ్డతీసి భార్యచేతి కిస్తాడు. దాని నామె వంకికి తగిలిస్తుంది. తల్లిదగ్గర కూర్చుని) రాము పిల్లలు కులాసాగావున్నారా?

తాయా:—నాయనా! నెమ్మదిగానేవున్నారు. ఇన్నిదినాలు రానికారణం లక్ష్మితో చెప్పాను. నీకు పనైందని చెప్పింది. నాయనా! నా కడుపులో పాలు పోసినట్లైందిరా. నే నిన్నిదినాలు పడ్డ మనోవేదన ఆ దేవునికే యెరుక.

నారా:—నేటికి కా సర్వేశ్వరుడికి కరుణ గలిగింది. ఇంతవరకు లక్ష్మి భర్త నేను భార్యగా వున్నాము. నేటికి నా భర్తృత్వం నేను తీసుకున్నాను. కాని తన స్వయార్జితమే గాని నాపోషణలో వుండదటమ్మా నీ కోడలు.

లక్ష్మి:—(నవ్వుతూ) చాలు లెండి మీ హాస్యం. అత్తా చూశారా యెలాఅంటున్నారో.

తాయా:—(నవ్వుతూ) అవునమ్మా! భరించేవాడు భర్త అని గదా అర్థం. ఇంతవరకీ సంసారాన్ని నీవు భరించావు. అందున ఆమాటన్నాడు. నాయనా ఖాయమేనా?

నారా:—ఖాయమే. కాని జీతం కొన్నాళ్ల వరకూ యింతే. మన అదృష్టరేఖ బాగుంటే క్రమంగా అభివృద్ధి అవుతుంది.

తాయా:—ప్రొద్దుపోయింది. నే నికపోతాను.

నారా:—అమ్మా! నాకు పనైంది గనుక నీ విక నావద్దే వుండాలె. నీ వికపో. చీకటపడుతూవుంది. రేపు నే నక్కడకు వస్తాను. చూడవే. నేను నిన్నుండమన్నాను గాని నీ కోడలామాటన్నదా.

లక్ష్మి:—నే నవకపోతేమాత్రం నాగుణం అత్తకు తెలియదా.

తాయా:—తల్లీ నీ గుణం నాకు తెలియదా. నీవు మా గృహలక్ష్మి. నాయనా నేను పోయి వస్తా. లక్ష్మి నేను పోయివస్తాను (అని బిడ్డలను ముద్దుపెట్టుకొని వెళ్లిపోతుంది).

## నాలుగవ రంగము

[రామారావు యిల్లు. రామారావు మంచంమీద చాలా నీరసంగా పండుకొనివుంటాడు. లక్ష్మి, తాయారమ్మ మంచంవద్ద దిగువ కూర్చుంటారు. రామారావు భార్య జానకి విచారంగా దూరంగా బిడ్డని యొడిలో పెట్టుకుని కూర్చుంటుంది. నారాయణరావు మంచంమీద రామారావు ప్రక్కలో కూర్చొని వుంటాడు.]

నారా:—రామూ! ఇప్పుడు వొంట్లో కులాసాగా వున్నదికదూ. డాక్టరిక భయంలేదన్నాడు. ఇక రెండు దినాలుండి నీవింత అన్నం తిన్నతర్వాత

మాయింటికి పోతాము. రోజూ నిన్ను చూచేందుకు సాయంత్రం వస్తాను.

రాము:—అన్నయ్యా! నీ వప్పుడే వెళ్లిపోతావా. నీవు నేను నిన్నన్న మాటలు మనసులో పెట్టుకోక నా ప్రాణాపాయస్థితిలో ఆదుకొంటివి బ్రతికాను. లేకుంటే యేమైపోదును. లేచి నీ కాళ్లు పట్టుకోలేను. అన్నయ్యా! నన్ను క్షమించవా. నేను నిన్ను ఆడిన దుర్భాషలు లెక్కలేదు. ఇంకా ముఖాముఖిగా నిన్ను దూషించి యిల్లు వెళ్లగొట్టాలని చూశాను. అటువంటి పాపాత్ముణ్ణి నన్ను మన్నిస్తానంటే నా జబ్బు నయమవుతుంది.

నారా:—నీవు నన్నేమీ అనలేదే. ఎందుకలా కలవరపడుతావు. నీకైన ఆన. నా కేమీ తెలియదు. నిన్నిక మన్నించేదెందుకు?

లక్ష్మి:—మీ అన్నగారితో నే నీ సంగతులు చెప్పలేదు. చెప్పుటవల్ల వారికి మనస్సులో కష్టం కలుగుతుంది. మీయిద్దరికీ మనస్తాపాలు వస్తుంది. కోపంచేత చిన్నవా ళ్లొకమాటంటే అదంత పాటించవలెనా. మా స్వల్పజీవితంలో అన్నిదినా లాదరించారే. ఇంకా యెన్నాళ్లు భరించగలరు. నాకుకూడా ఆమాటలకు కష్టంలేదు. వారికి కష్టం కలగకుండా చేయవలెననే మిమ్మల నామాటలు మీ యన్నవద్ద అనవద్దన్నాను. నాకే యిక్కడుండడం యిష్టం లేనట్లు వేరే కాపురంపెట్టించాను.

రాము:—వదినా! నేను లేవలేను. కుటుంబ కలహం లెక్కవ కాకుండా మా యన్నదమ్ము లొకరి మొహ మొకరు చూచుకోనంతటి మనస్తాపాలు రాకుండా తెలివితో కుటుంబాన్ని నిలబెట్టిన యిల్లాలికి నీకు పండుకునే నమస్కరిస్తున్నాను. నాతప్పు మన్నించు. నిన్ననరాని మాటలన్నాను.

లక్ష్మి:—రామూ! కోపంచేత తెలియకుండా యెన్నో అంటారు. వెనుక పశ్చాత్తాపపడ్డప్పుడా మాటలు మనస్సులో వుంచుకొంటారా. నే నా మాటలు మర్చిపోయాను. ఇందులో నన్ను పొగడవలసిం దేమీలేదు. నే నా కలహమంతా మీయన్నగారితో చెప్పి, మీరు మర్నాడు యిల్లు విడచిపోవాలని ఖండితంగా చెప్పియుంటే అభిమానగ్రస్థులైన మీ యన్నచేత పైసా లేక ఆలుబిడ్డలను పోషించే దారిలేక మీరు పొమ్మన్నతర్వాత మీ యింట్లోనుండ మనస్కరించక యెటూ పాలుపోక మనస్సు చలించి యేదైనా తెగిస్తే ఆ వెనుక మా గతేమి? ఎంతమం దట్లా చేయలేదు. ఇదంతా ఆలోచించే నే నీవిధంగా చేశాను. నా స్వార్థంకొర కట్లా నటించడం యేమంత గొప్ప.

రాము:—స్వార్థమో పరార్థమో. ఇంతదూరాలోచనచేసి భర్తను కుటుంబాన్ని కష్టాలనుంచి తప్పించేవాళ్లరుదు. అన్నయ్యా, ఆదినం వదినెను అమ్మను నోటికిరాని మాటలన్నాను. మర్నాడు నిన్ను యిల్లువిడచి తక్షణం పొమ్మనిచెప్ప నిశ్చయించాను. మా వదినె, అమ్మ చెప్పవద్దని కాళ్లు పట్టుకుని బ్రతిమాలారు. వారంరోజులలో వేరేపోతామని వదినె నన్ను సమాధానపెట్టింది. అలాగే చేసింది. లేకుంటే నేను నీతో చెప్పుట, వదినె చెప్పిన అనర్థాలు జరిగివుండేవి. నాకు శాశ్వతమైన అపకీర్తి నిలిచియుండేది. మనలనందరినీ యీ కష్టాలనుండి రక్షించిం దా మహాపతివ్రత. ఈ నిరుద్యోగదినాలలో యెన్ని సంసారా లిట్లా దారిలేక అల్లాడుతున్నవో, ఎందరు యువకులు పట్టభద్రులైయుండి పదిరూపాయ లుద్యోగం దొరక్క, భార్యాబిడ్డల పోషణకు మార్గంలేక నిరాశతో, నిస్పృహతో కాలక్షేపం చేస్తున్నారో. మన స్త్రీలు పనిపాటలు లేక పోవుటచేత వూరివారి గొడవలు చెప్పుకుంటూ, యెదుటివారి తప్పు లెన్నుతూ, పొరుగువారి సౌఖ్యము చూచి యోర్వలేక పగలంతా వుద్యోగంకోసరం తిరిగి కష్టపడివచ్చిన భర్తలను దెప్పి కష్టపెట్టుతూ వుండుటకన్న మా వదినె అనుసరించిన మార్గ మనుస

రించిన మనదేశంలో దారిద్ర్యంకొంతతొలగిపోవునేమో. నిజమైన గృహలక్ష్మి యీమెయే. గృహపరిశ్రమల వలన కొంతవరకు సంసారమును గడుపవచ్చునని తన ప్రవర్తవలన లోకమునకు చాటిచెప్పినది.

శ్లో. కార్యేషుదాసీ, కరణేషుమంత్రీ,
రూపేషురంభా, శయనేషువేశ్యా,
భుక్తేషుమాతా, క్షమయాధరిత్రీ,
సద్ధర్మయుక్తా, కులధర్మపత్నీ.

అను ఆర్యోక్తి మా వదినె సార్థకపరచింది. జానకీ! యేడుస్తూ అలా కూర్చున్నావేం. వచ్చి మా యక్క పాదాలకు నమస్కరించు. (ఏడుస్తూ జానకివచ్చి లక్ష్మి పాదాలమీద పడుతుంది).

లక్ష్మి:—పిచ్చిదానా! ఏడువకమ్మా. తెలివి తక్కువవల్ల చిన్నవాళ్లు తప్పుచేస్తే పెద్దవాళ్లం బుద్ధి చెప్పాలెగాని పగ సాధించవచ్చా. నా చెల్లెలువంటి దానివి. అదంతా స్వప్నమనుకో. నీ తోడబుట్టు ననుకో. విచారంమాని మరదిని జాగ్రత్తగా చూచుకో. చాలా నీర్సంగావున్నారు. భర్త క్షేమమే భారత స్త్రీకి యాధారం. సంసారమనే యెడారిని దాటేందుకు పురుషుడనే తోడు స్త్రీకి, స్త్రీయనే తోడు పురుషునికి జతపరచి తల్లిదండ్రులు తప్పుకుంటారు. ఇద్దరు బహుజాగ్రత్తతో ఒకరికొకరు సహాయం చేసుకొంటూ దాటి బయటబడవలెను. లేకుంటే అందులో చిక్కి దారి, తెన్నూ లేక అల్లాడవలెను. అత్తకు నమస్కరించు. ఆమె కడుపుచలవే మన భర్తల నపాయములనుండి రక్షించినది.

జాన:—అత్తా! నన్ను క్షమించండి. నే చేసిన తప్పు మర్చిపొండి.

తాయా:—జానకీ! లే అమ్మా లే. నా కొడుకులకు వచ్చిన బిడ్డలు. మీరూ నా బిడ్డలవంటివారే. మీరు తప్పుచేస్తే నేను క్షమించనా. ఇకమీదట మీ రిద్దరూ అక్క చెల్లెళ్లవలెనుండి నా కొడుకులిద్దరూ రామలక్ష్మణులవలె కలసి మెలసివుండి బిడ్డాపాపలతో పదికాలాలు సుఖంగావుండండి అనే నేను కోరేది.

నారా:—రామూ! ఇదంతా నీమనస్సులో పెట్టుకొని నీశరీరం పాడుచేసుకోక. మర్చిపో. నీ కారోగ్యం బాగాకలిగాక మనమిద్దరం ఒకటిగా సంసారము చేద్దాము. నాన్న వున్నప్పు డెట్లావున్నామో అట్లా గడపుదాము. అమ్మ పెద్దకాలానికి వచ్చింది. మన మేలుచూచి సంతోషిస్తుంది. నీ కోర్కప్రకారం మనమిద్దరం కలసుందాము. అమ్మా! జానకీ! నీవు నా చెల్లెలివంటిదానివి. నీవు చేసిన తప్పు మనస్సులో పెట్టను. రాము క్షేమంకొరకు సదా ప్రయత్నించు. నీ సౌఖ్యం నీ భర్తసౌఖ్యంలో యిమిడివున్నది. మనకింత మేలుచేసిన సర్వేశ్వరుని సదా మరువకుందాము.

---

# ప్రకృతిచిత్రము

సీ. కుసుమాలరాణియై కులుకుగులాబి దు
ర్గంధంబుచే పెంపు గాంచలేదె
ప్రోజ్వలజ్వాలాగ్ని బోలుసూర్యుండు గో
త్రారంగమున సూత్రధారి కాడె
మణులకు రేడయి మహితమౌ వజ్రంబు
బొగ్గుకులంబున పుట్టలేదె
ఉర్వినెల్లర కుపయోగించు లవనమ్ము
ఘనవిషవస్తు మేళనముకాదె
ఉప్పునీటనుగలయట్టి చిప్పలందు
ఇంపుగాముత్తియము జనియింపలేదె
కార్యకారణభావము కల్లజగతి
తలపనెంతప్రకృతి విచిత్రమ్ముగాని.

ఆకుండి వేంకట రమణమ్మ.

# శ్రీ రామ శ త క ము

శ్రీమతి దేచిరాజు లక్ష్మీనరసమ్మగారు

క. అన్నకు నీకును భక్తిని, నన్నమునిడు విప్రసతుల కానందముతో
జెన్నౌ కైవల్యమునిడు, వెన్నుఁడ నన్నేలు కృపను వీడక రామా!

క. సురరాజు శిలావర్షముఁ, గురియింపఁగ గోకులమున గో గోపకులన్
గరుణను రక్షింప మహీ, ధరమును ఛత్రముగ వ్రేలఁ దాల్చిన రామా!

క. తల్లిం దండ్రిని జెఱనిడు, బల్లిదుఁ గంసుని వధించి బలరామునితో
నుల్లమలర వారల ను, త్ఫుల్లముఖాబ్జమునఁ గాంచు మోహన రామా!

క. ధరణీసురుచే రుక్మిణి, వరసందేశము నెఱింగి పటుశౌర్యముతో
నరినృపతుల నురుమాడుచుఁ, బరమోత్సాహమున సతిని బడసిన రామా!

క. దారిద్ర్యబాధకోర్వక, దారపిడికెఁ డటుకులీయ ధరణీసురుఁడా
ద్వారక కరుదేరఁగనీ, వారసి సిరులిడిన ఘన దయాబ్ధివి రామా!

క. మునుధర్మ రాజొనర్చిన, ఘనమఖమునఁ జేది విభుఁడు గర్వోద్ధతుఁడై
నినుదూషింపఁగఁ జక్రం, బునఁదునుమవె వాని నృపులు వొగడఁగ రామా!

క. నారీమణిఁ బాంచాలిని, క్రూరుఁడు ధృతరాష్ట్రి సుతుఁడు కురుసభలోనన్
ఘోరముగ వలువలొలువఁగఁ, జీరల నా సాధ్వికిడి సీతారామా!

క. దురితాత్ముఁడు మున్నిడ్చిన కరుణను జూపించియుడలు కోమలిఁగనుచున్
గరుణారసమొల్క "సహోదరి! నేఁగల" ననెడిరాజ తనయుడ రామా!

క. ధరఁ బాలీశ సుయోధనుఁ, డరిభంజన నిన్నుఁగట్ట నాలోచింపన్
గురుబృందం బడలఁగ భీ, కరవిశ్వాకృతినిదాల్చు మాధవ! రామా!

క. తనవారలతో నాఢో, ధనమొనరుపఁ జాలననుచు దైన్యంబు వహిం
చినవిజయుని మోహము నీ, యనుపమ గీతలనడంచు నచ్యుత! రామా!

క. కురువీరులు భీతిల్లఁగ, నరిభీకరు భీష్ముదునుమ నాహవభూమిన్
సురపతిసుతుకరయుగ్మాం, తరమునశోభిల్లు చక్రధర! శ్రీరామా!

క. శరతల్ప గతుండై కడు, భరమునగాంగేయుఁ డమల భక్తుఁడు వేఁడన్
గరుణాతిశయతఁ గాచిన, హరి నిన్నే నమ్మికొలుతు ననయము రామా!

క. కనకము తేజమునొందఁగ, ననలంబునఁ బుటముచేయు నటులను నీవుఁ
జనులనుగుణాళి భాసిల, ఘనతరకష్టంబు లిడుచుఁ గాతువు రామా!

క. శిష్టుల సుగుణంబులవి, స్పష్టంబుగ నరసిపిదపఁ బరమప్రీతిఁ
గష్టములనెల్లఁ దీసిచి, సృష్టీశాఁ దరికివేగఁ జేర్తువు రామా!

క. మాలఁడటంచును పీడక, యేలితివా మోబదాను నినకులతిలకా!
వాలాయము నినుఁదలఁచిన, మాలనితో భూసురుఁడు సమానుడె రామా!

క. కవివర్యు లెందరైనను, భువిబమ్మెర పోతనార్యుఁ బోలంగలరే?
రవివంశవర్య భక్తినిఁ గవిభూషణుఁ డాతఁడయ్యె గద రఘురామా!

క. ఎందులకీ ధరణిని మ, మ్మందఱను సృజింపజేసి తయ్యా! శ్రీశా!
అందములగు బొమ్మలగతి, నందఱ నాడించుకొనుటకా శ్రీరామా!

క. అంజలిఁ జేసెద నోభవ, భంజన భక్తార్తిహరణ! పావననామా!
కుంజర మదహర! శ్రీరఘు, కుంజర! నన్నేలుమయ్య కూర్మిని రామా!

క. కోరను ధన ధాన్యంబులఁ, గోరను సొమ్ములను విలువ కోకల నెపుడుఁ
గోరెద నీపదసేవను, గూరిమితో నీయఁగదవె! కోసలరామా!

క. మతిఁగొల్పెడి రుగ్బాధల, ధృతిసెడు నవసానమందు దీనావన! మా
గతినీవై చలమూనక, యతులితదయఁ జేరఁదీయు మజనుత! రామా!

క. యమభటులఁ జేరనీయక, యమలకృపా రసముఁజిల్క యక్షయముగ శ్రీ
రమణీయుత! మీమృదుపద, కమలార్చన మొసఁగిమమ్ము గావవె రామా!

క. సీతాతరుణీ లక్ష్మణ, వాతాత్మజ యుతుఁడవగుచు వచ్చి కృపను నా
భీతిని బాపవె! కొల్తు స, నాతన! దీనాళిచందనద్రుమ! రామా!

క. ఏకశిలా పురవాసా, శ్రీకౌస్తుభ మణివిభూష! శ్రితజనపోషా!
నాకాధిప కమలాసన, శ్రీకంఠార్చితపదాబ్జ! సీతారామా!

క. ధర దేచిరాజుకులఘను, వరకౌండిన్యాఖ్యగోత్ర భవురామార్యుఁ
బరిణయమాడిన లక్ష్మి, నరసమ నీ కృతినొసఁగితి నయమతి! రామా!

క. అనుదినమీ శతకంబును, జనములు సద్భక్తితోడఁ జదివిన వినినన్
మనువంశతిలక! వారల, కనయంబును శుభములొసఁగు మచ్యుత! రామా!

# మనవి

శ్రీ ఒ. వెంకటరంగయ్యగారు

కడపజిల్లా రాజంపేట తాలూకాలో బాహుదాతీరమున కిచ్చమాంబాపురాగ్రహారమున పూర్వము వేదశాస్త్రపారీణు లగు బ్రాహ్మణు లనేకులుండిరి. వారిలో ననేకులు అగ్నిష్టోమాదులు పారంపర్యముగ జేసిన యజ్వలుండిరి. వీరికి మట్లవారి సంస్థానము గొప్ప ఆశ్రమముగనుండినది. ఈ బ్రాహ్మణకుటుంబములలో "నందేల"వారను నొక కుటుంబముండినది. వీరును సోమయాజులై శ్రౌతప్రయోగముల బ్రసిద్ధులుగ నుండిరి. ఆకాలపు స్త్రీలలో ఈ కుటుంబములోని స్త్రీలును కొందరు విద్యాధికురాండ్రుగనుండిరి. నందేల సీతారామశాస్త్రిలవారి కుమారిత శేషమ్మగారు చెప్పిన పాటలు కొన్ని కడప, నెల్లూరు, గుంటూరు మండలముల ప్రచారములో నున్నవి. వానిలో ముఖ్యముగ యజ్ఞేశ్వరుని మీదిపాటలు పెండ్లిండ్లలోనను ఇతర శుభములయందును అగ్నికార్యము జరుగునపుడు ఆరతికిని "శోభాన" పాటలకును ముత్తైదువులచే పాడబడుచున్నవి. మరియు నందేల సుబ్రహ్మణ్య యజ్వగారి కుమారిత యొకర్తు యజ్ఞములో సంకల్పశాలాప్రవేశములు మొదలు అవభృథమువరకుగల సమస్త శ్రౌతక్రియాకలాపమును ఒక పెద్ద ద్విపదగీతమున మనోహరముగ చెప్పినది. ఈపాటను అందదుకులుగను లెక్కలేని తప్పులతోడను ఇప్పటికిని ఈ ప్రాంతములందు సోమాభిషవప్రకరణమున ముత్తైదువులు పాడుచు సోమలతను దంచుదురు. కొన్నియెడల ఋత్విక్కులే కొందరు స్త్రీలకు నేర్పి వారిచే పాడించెదరు. కొందరు స్త్రీలకు పారంపర్యముగ నోటికి వచ్చియుండుటయు కలదు. అట్లును ఇట్లును కానియెడల ఎట్లో యొకవిధమున అధ్వర్యులే ఈ సాంగెమును జరిపి ఏరెండు చరణములనో పాడుదురు.

ఈపాటకు సోమపాట యనియు సోమాతీగెపాట యనియు వాడుకపేరు కలిగియున్నది. ఈపాటను రచించిన విదుషీమణి పేరు తెలియదు. పాటయొక్క కడభాగమున నందేల సుబ్రహ్మణ్య యజ్వకుమారితయని మాత్రము కలదు. పేరులేదు. ఈపాటయందు రాజవారిసీమ నేలిన మట్ల వెంకటరామరాజుగారి పేరున్నది. బహుశః ఈ యాధారమున నీపాట ఆరాజుగారి కాలమున వ్రాయబడియుండునను యూహ కవకాశమగుచున్నది. రెండు శతాబ్దములు దాటినట్లున్నది.

ఈపాటను పూర్తిగ లభ్యపరచుకొని అక్కరయున్నయెడల సంస్కరించి అచ్చువేయించు నుద్దేశముతో ఈ ప్రాంతములలో అచటనచట ప్రయత్నింపగ కొన్ని శ్రోత్రియ కుటుంబములలో రెండు మూడు ప్రతులు దొరికినవి. ఒక్కటియు సంపూర్ణముగలేదు. మరియు అక్షరప్రత్యక్షరమునను తప్పులున్నవి. పూర్ణగ్రంథము దొరికినయెడల స్త్రీల కాణయాచియగు నీ గృహలక్ష్మి

యందే దాని ప్రకటింపనగును. పూర్ణప్రతి లభించినమొదల ఆంధ్రాభిమానురాండ్రగు యువతీజనము వానిని పత్రికాలయమునకు జేర్పవచ్చునని ప్రార్థించుచున్నారము. పాట అంతయు నూటయేబది చరణములలోపల నిమిడియున్నది. దీనియందు యాజ్ఞిక, ప్రక్రియ చక్కగ వర్ణింపబడియున్నది. ఇట్టి వానివలన మన యాంధ్రదేశమున నెంత గొప్ప విద్వాంసురాండ్రు వర్ధిల్లినదియు దెలియగలదు. ఇట్టి ప్రకటనలు స్త్రీజనాభివృద్ధికి సాధనములు కాగలవు. ఈపాట వ్రాసిన కవియొక్క చరిత్రమును దెలిసినవారు దానినిగూడ దెలుపవలయుననియు ప్రార్థన.

## మొల్ల

శ్రీ ఉభయభాషాప్రవీణ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు

ఉ. మల్లెలుపూచెఁబో! మలయమండల మారుతశాబకంబు ల
ల్లనవీచెఁబో! చవులకాశ్రయమై మకరందవాహినుల్
వెల్లువలయ్యెఁబో! తెలుఁగులేమ కపూర్వయశంబొసంగుచున్
నెల్లురిమొల్ల రామధరణీపతి పుణ్యచరిత్రపల్కినన్.

ఉ. కుమ్మరిపిల్లవంట పలుకుంజవరాలికి నీకు బాంధవం
బెమ్మెయినబ్బె? నీకుఁ జదువెవ్వఁడుసెప్పె? సుదారతానిధా
నమ్మగు నమ్మహాపురుషునామము సెప్పెదవేని హృద్యప
ద్యమ్ములొసంగి వానిశతథానుతి సల్పుదునమ్మ! సోదరీ!

చ. తెలుఁగుల నోముపంటయగు తిక్కనకావ్యము తాటియాకుపైఁ
దొలుత లిఖించుభాగ్యమును దోఁచిన వ్రాయసగాని కోవలో
మొలచిన మొక్కవా? చరితముఁ వినిపింపుము యిట్లుగానిచోఁ
గలుగునెనీకు నింతనవకమ్మనఁ గబ్బముగూర్చు నేరుపుల్.

ఉ. చూచినయంతనే చదువఁజొచ్చిన యంతనె యర్థభావముల్
పూచిఫలించునేని యదెపో! సుకవిత్వపదంబు నందఁగా
నోఁచినకైతయం చతిమనోహరఫక్కి వచించి నీప్రతి
జ్ఞాచరణంబు సార్థకమయానటు సల్పితి వింతయొప్పునే!

ఉ. కంచనపల్లివారి కనకమ్మ నిరర్గళసాహితీ రసో
దంచిత కావ్యకన్యకలకమ్మ తెలుంగువెలందికీవు క
ల్గించిన పేరునిల్పి పరికీర్తితమైనది; తద్యశోలతల్
పెంచెడి ముద్దుఁగూఁతులు లభించుత నిత్యము నాంధ్రభూమికిన్.

# కలహం

శ్రీ చోడవరపు రామశేషయ్యగారు

ఉదయం పదిఘంటలయింది. బారిష్టరు శివరావు గారి బేబీకారు తన సూక్ష్మకాయాన్ని దొర్లించుకుంటూ యింటి ఆవరణలోకి వచ్చింది. కారుకై కనిపెట్టుకునివున్న శివరావు వెంటనే బయటకువచ్చి పెట్రోలుందా అని డ్రైవర్ని అడిగాడు. ఉందని డ్రైవరుచ్చరించడంలోనే 'హాట్' కై యింట్లోకి పోయాడు. పార్వతితో చెప్పందే ఆఫీసుకు పోయే అలవాటులేదు శివరావుకు. పార్వతి ఎందుచేతోగాని యీదినం యింకా ఇంట్లోనే ఉండిపోయింది. శివరావు పార్వతీ! అని పిలిచాడు. పిలిచీ పిలవకముందే 'ఆఁ! వస్తున్నా'అని అంటూ గబగబ మూతితుడుచుకుంటూ వచ్చింది. ఆమె తుడుచుకుంటూవున్న మూతివంక చూస్తూ 'ఇంకా భోజనం కాలేదూ'అన్నాడు ఆశ్చర్య పోతూ శివరావు.

'అయింది; కాకపోవటం ఏమిటీ'అందికొంచెం త్వర పాటుతో.

'అయితే యింకా మూతికడుక్కోలేదూ !'

'కడుక్కునే వచ్చాను'.

'పల్లెటూరివాళ్లు ఇట్లాగేకడుక్కుంటారు కాబోలు!'

'ఏం పల్లెటూరివాళ్లకు మూతి కడుక్కోవడం కూడా చేతగాదా ఏమిటి?'—అని కొంచెం దురుసుగానే అంది పార్వతి.

'చూచుకోరాదూ అద్దంలో నామాట అబద్ధం అయితే' అన్నాడు శివరావు హేళనంగా.

'ఎందుకూ చూచుకోటం'? అంటూ కుర్చీమీద పడివున్న తుండుతీసికొని మూతి తుడుచుకుంది పార్వతి. మూతిని అంటుకునివున్న రెండు మెతుకులూ దాని కంటుకున్నాయి. వానినిచూచి కొంచె చిన్నబుచ్చుకున్నప్పటికీ 'ఎక్కడా ఎంగిలి. ఏమీ పనిలేకపోతే సరే ఏదోవంకపెట్టి పల్లెటూరి వాళ్లకేమీ తెలీదని బుజావుచేయడానికి ప్రయత్నిస్తారు' అని అంది బింకంగా.

'ఓ ప్రక్కన చూచుకుంటూకూడా అబద్ధం ఆడుతావెందుకు ?' అన్నాడు శివరావు.

'నేనేమి అబద్ధం ఆడలే' అనికొంచెం కోపంగానే అంది పార్వతి.

'ఆడవాళ్లకు అబద్ధాలాడటం అలవాటేమో! నాకేం తెలుసు. అబద్ధంకూడా నిజమే అవుతుందని నీదృష్టిలో. భయపడి తొలగిపోతూవున్న ఆడపులిని బాణంవదలి రెచ్చకొట్టినట్టయింది. శివరావన్నమాట శూలంవలె వెళ్లి పొడుచుకుంది పార్వతి హృదయంలో. క్రోధాగ్ని క్రక్కుతూవున్న కండ్లతో చురచుర చూచింది శివరావువైపు. శివరావు వ్యవహారం ముదిరిందని కాలుకాలిన పిల్లివలె నెమ్మదిగా పోయి కారులో కూర్చున్నాడు.

కారువెళ్లేవరకు పార్వతి అక్కడే నిలబడివుంది. అది వెళ్లడంతోటే పండ్లు పటపట కొరుకుతూ తన గదిలోకిపోయి తలుపువేసికొని మంచంమీద పడింది. ఆమె హృదయంలో అర్థంలేని తుపాను ఝంకారాలు చేస్తూ బయలుదేరింది. పల్లెటూరివాళ్లకేమీ తెలీదు. వాళ్లెందుకూ కొఱగానివారా! అడవి మృగాలా! మానావమానాలు లేనివాళ్లకి! మూతిని ఎంగిలివుంటే ఎద్దేవచేయాలా ? అందులో నౌకర్ల ముందు పట్టుకుని! మూతి కడుక్కోమని ముద్దుగా చెప్పకూడదు? పల్లెటూరివాళ్లంటే ఇంత తేలిక ! వీరెక్కడ పుట్టారు! ఎక్కడ పెరిగారు!! ఇంగ్లండు వెళ్లి బారిష్టరుపరీక్ష పాసై వచ్చేంతలోనే దొరలయిపోయారు! మేమె! పల్లెటూరి గబ్బిలాయిలుగానే ఉండిపోయాము! అయితే ఇంత చదువుకుని వీరు చేసిన మహోపకారం ఏమిటి ? మాబోటి మూర్ఖులకు

విద్యాబుద్ధులు గలపకూడదూ! పరాయిచేత నావల్ల పొరబాటుకలిగింది. అయితేమాత్రం విద్యావంతులయిన మీరు నన్ను ఎగతాళిచేస్తారు! అనుభవహీనుర్ననయినప్పటికీ అభిమానం అనేదిలేదూ! వారు నన్నెంతో ప్రేమిస్తున్నారనుకున్నా. అది నిష్కపట ప్రేమే అయితే యీ వెక్కిరింతలెందుకు? ఈవేళాకోళాలెందుకు? అందులో నాకళ్లయెదుటా! పల్లెటూరివాళ్లనకపోతే వారికింకోమాట ఏమి తోచలేదు కాబోలు. పల్లెటూరి మహాత్మ్యం వీరికేం తెలుస్తుంది. అదే లేకపోతే వీరీ విధంగా యీ పట్నాల్లో ఆడేవారే కాలేరు. పల్లెటూరులోపుట్టిన వీరికి పల్లెటూరంటే ఇంత ఏహ్యమెందుకో! ఏమో! మగవారిని అర్థంచేసికోవడం చాలాకష్టం.

ఎంతవమానం జరిగింది! మూర్ఖురాలనై పోయానే! అబద్ధాలకోరునయి పోయానే!! ఇంకాయెట్లా తలెత్తుకుని తిరిగేది? నౌకరులు చెప్పకోరూ, మన అమ్మగారికి మాటి కడుక్కోవటంకూడా తెలీదు అని. ఇంక వారి (పెనిమిటి)తో యెట్లా మాట్లాడేది? నా ముఖంవారికి యెట్లా చూపించేది? ఈగదిలోనె ఉండిపోతా, వారువచ్చినా బయటకుపోను. పిలిస్తే చెవెడుతా.

వారెన్నిసార్లు రోజూ కట్టుకునే 'టై' తప్పకట్టుకున్నారో! అదిచూచినేను వారినేమైనా అన్నానా. మాట్లాడకుండాపోయి చక్కగా సరిచేసుకలేదూ! ఈ స్వల్పభాగ్యానికి నన్నింత హేళనచేయాలి!

* * * * *

రాత్రి యెనిమిది ఘంటలయింది. శివరావు మామూలుగా వచ్చేవేళకే యింటికి వచ్చాడు. గుమ్మంలో అడుగు పెట్టేసరికి, ప్రతిదినం తనరాకకై నిరీక్షిస్తూ వుండే పార్వతి కనుపించక పోయేసరికి నాటి ఉదయం జరిగిన ఘటనంతా జ్ఞాపకం వచ్చింది. ముసిముసి నగవులు నవ్వుకుంటూ తిన్నగా తన గదిలోకి పోయాడు. డ్రస్సు తీసివేసి అటుఇటు చూచాడు. చెవులు లెక్కించి విన్నాడు. కాని అంతా నిశ్శబ్దం. ఏమి చెప్మా! పార్వతి ఇంట్లోలేదా ఏమిటి? తన స్నేహితురాలిని చూడ్డానికి వెళ్లిందేమో అని అనుకుంటూ పార్వతి గదివైపు వెళ్లాడు. ఆమె గదితలుపులు లోపల గొళ్లెంపెట్టి వుండటంచూచి నిర్ఘాంతపోయాడు. పెదవి కొరుక్కుంటూ స్నానాగారంలో ప్రవేశించాడు. స్నానంచేసి భోజనానికివచ్చి కూర్చున్నాడు. వంట బ్రాహ్మణుడు శివరావుకి మాత్రమే వడ్డించాడు. నిత్యం తనతోపాటు భోజనానికివచ్చే పార్వతి యీవేళ రాకపోయేసరికి ఆయన మనస్సు చివుక్కుమంది. నాయీచిన్న తప్పిదానికి యింత కఠినశిక్షా! అని అనుకున్నాడు. కాని యింకా పార్వతి వస్తుందేమో అనే ఆశ శివరావుని వదలలేదు. ఎంత సేపటికి రాకపోయేసరికి విసుగెత్తి ఏదో రెండు మెతుకులుతిని లేచిపోయాడు. రోజూ ఎంతో ఉల్లాసంగా గడిచే యీ భోజనాల సమయం నేడు నీరసంతో గడిచిపోయింది.

భోజనం అయిం తరువాత శివరావు మేడమీదకు వెళ్లాడు. అయనకింకా పార్వతి స్వయంగా తమలపాకులు తీసికొని వస్తుందని నమ్మకం ఉంది. అందుచే మాటిమాటికి మెట్లవైపుచూస్తూ కూర్చున్నాడు. చివరకు మెట్లమీదనుంచి శబ్దం వినబడింది. పార్వతి వస్తావుందని యెంచి ఏమీ యెరుగనట్టు మంచంమీద పోయి పడుకున్నాడు. కాని పాపం పార్వతికాదు; ఆవచ్చింది వంటవాడు, శివరావు నిర్ఘాంతపోయి వానివంక చూచాడు. అతను ఆకులపళ్లెం అక్కడ పెట్టి వెళ్లిపోయాడు.

నేనేదో తమాషాగా అన్నమాటకేనా పార్వతి కింతకోపం వచ్చింది! వేళాకోళంగా అన్నానేకాని ఆమెను అవమానపరచాలని అనలేదే. ఇంతమాత్రానికి ఇంత పట్టుదలా! భార్యాభర్తలు సరససల్లాపాలాడుకోరూ?....పార్వతి యెంతో సహనశీల, గుణవతి. నన్ను మనసార ప్రేమించిన పవిత్రమూర్తి. అట్టి

ఆమె నేనన్న యీ చిన్నమాటకే యింత కోపగించిందంటే చాల ఆశ్చర్యంగావుంది.........నే నపదర్భంగా మాట్లాడాననుకుంటా. లేకపోతే ఎప్పుడూ లేని ఈ వింతచర్యలు నేడెందుకు తటస్థించుతాయి. నేనురావటం ఒకనిమిషం ఆలస్యం అయితే తహతహలాడే పార్వతి నేడుఇట్లా యెందుకు చేస్తుంది? ఆమె కోమలహృదయాన్ని నొప్పించానుకాబోలు. నేను నిజంగా చాలా పొరబాటు చేసాను.........కాని భర్తనైనవాడు ఇంతమాత్రం స్వతంత్రంలేదు; నీమూతిని ఎంగిలి ఉందని చెప్పటానికి. నేనామాట అన్నప్పుడు ఉంటేమో అని అనకుండా 'టవల్' తీసుకొని తుడుచుకోటం ఎందుకు. తుడుచుకుందిపో. తుడుచుకున్నప్పుడు దానికి అంటుకున్న మెతుకులు చూచికూడా లేవని అబద్ధం ఆడటం ఎందుకు? నాదగ్గఱ సిగ్గుపడటం ఎందుకు! అబద్ధం ఆడటం ఎందుకు!! నేనామె ప్రియ భర్తనుకాను? నేనామె ప్రేమించుటలేదు!! మా ఇద్దరిలో యీ భేదమెందుకుండాలి? ఒకరితప్పు లొకరు దిద్దుకోవడం దాంపత్య ధర్మం కాదూ! ఈ స్వల్పభాగ్యానికి ఇంత పంతమా? ఈ ఆలోచనలతో నే రాత్రి అంతా ఏకాకియై గడపాడు శివరావు.

ఉదయం ఏడు ఘంటలయింది. రాత్రంతా నిద్రలేని కారణంచే కళ్లు నులుముకుంటూ బద్ధకంతో బెడ్ కాఫీకి తయారయ్యాడు శివరావు. టేబిల్ మీద కాఫీ అయితే ఉంది; కాని ప్రక్కన పార్వతిమాత్రం లేదు. ఇంకానన్ను క్షమించలేదు; అని అనుకుంటూ రెండు గ్రుక్కలు కాఫీత్రాగి కాలకృత్యాలు తీర్చుకోటానికి వెళ్లిపోయాడు. ఆ పనులనుండి నివృత్తు డవటంతోనే ఉడుపులు ధరించుకొని కారెక్కి ఆఫీసుకు వెళ్లిపోయాడు.

* * * * *

టయంకాండే భోజనం చేయకుండానే శివరావు వెళ్లిపోవటం చూచి పార్వతి నిర్ఘాంతపోయింది. తన్ను తాను దూషించుకోవటం మొదలుపెట్టింది. దీనికంతా కారకురాలు తానేయని పదేపదే అనుకోవటం మొదలుపెట్టింది. నేనెంత కఠినురాలను, నిర్దయను! దినమంతా వాగివాగి కష్టబడలి ఇంటికి వచ్చేసరికి మిథ్యాభిమానంతో వారికెంత కష్టం కలుగచేశాను. రాత్రిభోజనం సరీగా చేయలేదు. ఉదయం ఆభోజనం కూడా లేకుండానే వెళ్లిపోయారే! అయ్యో! అయ్యో! ఎంతపని చేశాను; నేనెంత మూర్ఖురాలను. వారి అర్థాంగినైనేను చేయవలసినపని ఇదేనా? వారేదో వేళాకోళంగా అన్నమాటకు నాకింత కోపము, పట్టుదల ఎందుకు? నామూలాన్ని అన్నపానాలు మానివేశారుగదా!

* * * * *

శివరావు మామూలుకంటె రెండుఘంటలు ముందుగానే వచ్చాడు ఇంటికి. ఆకస్మికంగా ఈ రావటాన్ని చూచి పార్వతి కంపించిపోయింది. ప్రేమతప్తయా హృదం ఎప్పుడూ ఏదో ఒకటి శంకించుతూ ఉలిక్కిపడుతూ వుంటుంది.

శివరావు ఉడుపులనైనా తీయకుండ తిన్నగా మేడమీదకుపోయి మంచంమీద పడుకున్నాడు. క్షుధా పీడితుడగుటచే సొమ్మసిల్లి కండ్లుమూశాడు.

పార్వతి ఇక నిలువజాలక పోయింది. అడుగు పెట్టకుంటూ చప్పుడుకాకుండా మెట్లెక్కింది. గది వైపు చూచింది. శివరావు కనుపించలేదు. గబగబ కొట్టుకుంటూవున్న హృదయాన్ని చిక్కబట్టుకుని ముందుకుసాగింది. శివరావు కండ్లు మూసికొని పండుకొని వుండటం చూచింది. నెమ్మదిగాపోయి శివరావు కాళ్లదగ్గఱ నిలబడింది. డస్సిపోయిన శివరావు వదనం చూచేసరికి పార్వతి హృదయం పటాపంచలయింది. అశ్రుధారలు అనర్గళంగా అప్లావితంచేయ మొదలుపెట్టాయి శివరావు పాదాల్ని. శివరావు ఉలిక్కిపడి లేచాడు. ఎదుట పార్వతి వెక్కివెక్కి ఏడుస్తూ నిలబడివుంది. గభాలున క్రిందకుదూకి ఆమెను తన కౌగిట్లోకి తీసికొన్నాడు.

# గుణవతి

శ్రీమతి గుడీపూడి ఇందుమతీదేవిగారు

## అష్టమదశము

'విభుని కూరిమికంటె మేల్వేరెగలదె'

క. కంకణనిస్వనమొక్కటి, పంకజముఖి కర్ణగర్భభాగముజొర నీ
వంకవిమలవచ్చెనటని, శంకగనులువిచ్చియెదుట పరగంగాంచెన్.

క. కన్నులకాటుకనీలిమ, పెన్నెఱివేణియును నమరు పిడికిటనడుమున్
తిన్ననిధౌతసుచేలము, వెన్నెలకుందలకుమేనిఁ వెలుగుంజెలగన్.

గీ. అఖిలసద్గుణమణిపేటిరాసి యనగ, నొప్పి యెదుటనిలిచినజవ్వని నుదరిపాటు
గదుర నెఱిజాజికన్నుల గదియజూచి, మాటలాడింప నా చారుమతిదలంప.

ఆ. మిగులవగలనొగిలి మేనితేజదొఱంగి, యలయు నీమెనవతియౌనటంచు
చెంతజేరి యీ సుశీలయె యీయింతి, నామమడిగి తెలిసి నయముగదుర.

క. కలతెఱగెల్లందెలియం, బలుకుచుగష్టములుదీరె భవ్యగుణాఢ్యా
తొలివచ్చినసాధ్వీమణి, వలతంబడకమ్మ భాగ్యమంతయునీదే.

క. చెలియలివలెననుకూరిమి, యలవడగానేలికొనుము యక్కరొ నాథుం
గలిసిసుఖయించుభాగ్యము, గలిగె కలతవడకుమింక కర్మముదీరెన్.

క. నీకొనరించినయుపకృతి, యేకరణిందీరుసాధ్వి యికనడలకుమీ
నీకూర్మిగోరినాథుడు, నీకై దలపోయునిజము నిరతముమదిలో.

క. నీ తెఱగు మొన్నవింటిని, నాతిరో వచ్చితినిప్రాణనాథునితోనే
నీతరినీవుంగలిసిన, చేతోమోదంబునాకు సేకురుననినన్.

క. ఆచారుమతియు వేసవి నాచాతకకాంతవోలె నానవనవలా
వాచామృతరసకణగణ, సేచన దెప్పిరిలి చింతజేసెనుమదిలో.

గీ. క్రొత్తయైననుమదిని సంకోచపడక, సత్యమువచించె చాటు నీచాన విమల
మూర్తియేపో దయారసస్ఫూర్తియెందు, నుపకృతినొనర్చువారల కున్నె క్రొత్త.

గీ. ఈమెపతితోడనను గూర్చనెంచె, నిట్టియుపకృతికి ప్రత్యుపకృతి వేయున్నె జేయ
నని యమరభోగముల నందినట్టులలరె, విభునికూరిమికంటె మేల్వేరెగలదె.

# స్త్రీలు - సౌందర్యపోషణ

శ్రీమతి తురగా కృష్ణవేణమ్మగారు

సాధారణముగా స్త్రీకి అందము—చందము బొట్టు, కట్టు, జుట్టు, కనుముక్కు—తీరు_ఇత్యాది విషయములమీద నాధారపడివుండును. సహజసౌందర్యవతి గాకపోయినను, పరిశుభ్రత—ఆరోగ్యనియమములు పాటించినయెడల రూపవిహీనురాలయిన లోటు కనుపించదు. రూపసియయినప్పటికి శుభ్రత గమనించనియెడల నివురుగప్పిన నిప్పుచందమున సౌందర్యము మరుగుపడియుండును. స్నానాది కర్మలవలన ఒక దేహపరిశుభ్రత విషయములోనే శ్రద్ధజూపుట గాకుండ, వస్త్రధారణపద్ధతి, పాపిట దిద్దుకొనుట, తలకట్టు ముడుచుకొనుట, తిలకము, కాటుక దిద్దుకొనుట మొదలుగాగల అలంకారములలో కూడ తగుశుభ్రత, అనువగు నందచందములు గమనించవలెను.

## తలకట్టు

తలకట్టు అనగా ఒక శిరోజములే యని కొందరి యభిప్రాయము కాని కేశములు, పాపిట, జడకలసినదానికి తలకట్టు అందురు. మన స్త్రీలలో కురులు ఎంత నలుపుగానున్న అంత సౌందర్యం కాని పాశ్చాత్యులలో ఎంత గోధుమవర్ణముగానున్న అంత అందము. మధ్యపాపిట పెద్దమనిషి తరహా సూచించును. కాని అందమునకు ప్రక్కపాపిట యనియే చెప్పవచ్చును. కొన్నిదినములు ఎడమపాపిట, కొన్నిదినములు కుడిపాపిట దువ్వుకొనిన కురులయొక్క తీరు చెడిపోవును. కనుక ఒకేవైపు పాపిటకు అలవాటుపడియుండవలెను. శిరోజాభివృద్ధికి ఏఇతర వాసననూనెలుగాని, అగరునూనెలుగాని, అభ్యంజనములుగాని కొబ్బరినూనెయంత చవుకయగునవి, ప్రశస్తమగునవి కావు. వాసనకు కొబ్బరినూనెకు వట్టివేళ్లుగాని, కొంచెము essence గాని కలుపుకొనవచ్చును. పాశ్చాత్యానుకరణమువలన ఇటీవల కొందరు స్త్రీలు తమ దీర్ఘనీల కుంతలముల కత్తిరింపు జేసుకొని ఉంగరముల జుట్టు (bobbed hair) పెంచుతున్నారు. కాని ఇట్టివారు సంసారస్త్రీలలో లేనేలేరని చెప్పవచ్చు. కాని కేశములు విశేషముగా నుంగరములు తిరుగకపోయినను నొక్కు-నొక్కులుగా జుట్టు ఏర్పడి తలకట్టుకు చాలా సౌందర్యమిచ్చులాగున చేసుకొనవచ్చు. ఇందుకుగాను అభ్యంగనస్నానమాచరించినపుడు జుట్టు బాగుగా చిక్కుదీసుకొని, తలకట్టు ముడుచుకొని, తైలసంస్కార మొనరింపక 2 లేక 3 రోజులు ఉంచి తలవెండ్రుకలు బాగా బిరుసుపడునట్లు చూడవలెను. తరువాత ఒక భరణిలో కొంచెం కొబ్బరినూనె, కొన్ని నీటిచుక్కలు బాగుగా రంగలించి తలకు రాచుకొనవలెను. మరుసటి రోజునుండి కొన్నిదినములు పామేడ్ గనుక రాచినట్లయిన జుట్టుకు నిగనిగ ఏర్పడి నొక్కులు



శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు

ఆంధ్రదేశమున స్త్రీసంఘముసుద్ధరించు తలంపుతో 'శారదానికేతనము'ను గుంటూరున స్థాపించి పదునాలుగేండ్లుగా తీరని కృషిచేయుచుండు ఉన్నవ దంపతుల నాంధ్రలోక మెరుగనిది కాదు. వీరిపుడు నికేతన సాహాయ్యార్థమై బర్మాకరిగి యున్నారు. ఆంధ్రాభ్యుదయమును గోరు బర్మా ఆంధ్రప్రముఖులు వీరికి యథోచితముగ ధన సాహాయ్య మొనరింతురని కోరుచున్నాము.



'కచదేవయాని'లో దేవయాని (కృష్ణవేణి)

ఇదివరలో యీయువతియే 'సతీఅనసూయ' లో అనసూయ భూమికను ధరించినది.

" వృషభరాజాయ తే నమః "

చిత్రకారిణి: సంగం లక్ష్మీబాయమ్మ.

ఏర్పడును. బాగుగా నేర్పడువరకు కొన్ని అభ్యంగనములవరకు చేయవలెను. బర్మా చుట్టలు, వాలుజడలు, వ్రేలాడుజడలు, వదులుజడలు, కొండెశిఖలు అని అనేకరక ములుగా వ్యక్తి ఇష్టాఅయిష్టముల ననుస రించి జడలు వేసుకొనవచ్చును. బర్మా శిఖ జుట్టె అర్ధచంద్రాకారముగా అందమైన పుష్పములు తీరువగా ముడిచినట్లయిన తల కట్టుకు చాల సౌందర్యమిచ్చును.

## వస్త్రధారణ

చీర శృంగారించుకొనుటలోకూడ చాల నేర్పుండవలెను. వారివారి సాంఘికాచార ముల ననుసరించి యీ వస్త్రధారణలో కూడ అనేక పద్ధతులు కలవు. అందుచే ఆంధ్ర, తమిళ, బంగాళ, కన్నడ మొద లుగాగల స్త్రీలలో వస్త్రధారణ పద్ధతిలో చాలా వ్యత్యాసములు మనము చూచు చున్నవే. బట్టకట్టు నేర్పుకు ఆంధ్రస్త్రీలకే అగ్రతాంబూల మియ్యవలెనని చెప్ప వచ్చు. గోచిబోసికట్టు శాస్త్రరీత్యా మంచిది. అందమునకు గూడకట్టుయే అని చెప్పవచ్చును. ఇప్పుడు ఖద్దరులోకూడ చీరలు చాలా సన్నితమైనటువంటిన్నీ పలు రకమైన అంచులతోను, జరీలతోను అత్యా కర్షణీయముగా ఉంటున్నాయి. కనుక ఖద్దరుచీరలు ధరించు టుత్తమము.

## బొట్టు, కాటుక

ముఖమునకు తిలకము చాలా సౌంద ర్యము. తిలకము లేని ముఖము చంద్రుడు లేని రాత్రివలె కళావిహీనముగానుండును. సాధారణముగా ముఖము, నుదురువిశాల ముగానున్న వారికి పెద్దబొట్టు అందము. తక్కినవారికి చిన్నబొట్టు అందము. చామన చాయవారికి ఎర్రకుంకుమ ఎర్రటి శరీర చ్ఛాయ గలవారికి నలుపుకుంకుమ అందము.

కాటుక ధరించు అలవాటున్నవారికి కాటుక పల్చగా ధరించునెడల ముఖము కళగానుండును. కాటుక ధరింపకపోబట్టియే కండ్ల జబ్బులకు కారణము.

## ముఖసౌందర్యము

ముఖసౌందర్యముకొరకు ఫేస్‌పౌడర్లు, స్నోలు, సబ్బులు అవసరములేకయే వీలగు నట్లు యీదిగువ సంగతులు తెలుపును.

1. ఎండిన వుశికబెండు, మందార పుష్పము, పండు కరక్కాయబెండు, జాపత్రి, కచ్చురాలు, గోధుమసత్వము, పచ్చకర్పూ రము వీటిని సమభాగములుగ చూర్ణము చేసి ముఖమునకు నూనెమెరుగు రాసుకొని నలుగుపెట్టుకొనిన ముఖము పూర్ణచంద్రుని వలె ప్రకాశించును. (గోధుమసత్వము అనగా గోధుమలు బాగుచేసి రెట్టింపు నీటిలో 3 దినములు నానబెట్టి, బాగుగా పిసికి, వడియగట్టి, పిప్పిని తొలగించి, అడు గునకు పాత్రలో దిగిన నీటిని సూర్యరశ్మిలో నుంచిన నీరు ఆవిరియయి తెల్లటిగోధుమ సత్వము వచ్చును).

2. నల్లనువ్వులు, తెల్లఆవాలు సమభాగ ములుగా పొడుముచేసి ఆవుపాలతోనూరి ముఖమునకు 15 దినములు నలుగుపెట్టిన ముఖము దేదీప్యమానమై ప్రకాశించును.

# సౌందర్యపిపాస

శ్రీ కుందుర్తి నరసింహారావుగారు

"ఛీ! నే నింకనైనా ఒక నిర్ణయం మీద నిలిచివుండాలి. ఈ చాంచల్యం యేమిటి?

"సౌందర్యపిపాసచేత పిచ్చివాడినే అయినా ననుకో. పెళ్లిచేసుకున్న భార్యతో నీవు నాకువద్దు అని స్పష్టంగా చెప్పి పంపించివేశాను. ఇంక మళ్లీ దాన్ని తలచుకోటం బలహీనతకాదా? ఈసారి ఆ తలపు వస్తే ఆత్మహత్య చేసుకుంటాను" అనుకుని వూరుకునేవాడు.

ఆనాడు లేచినంత పెందలాడి భుజంగరావు ఎన్నడూ లేచి యెరగడు. మనస్సులో యేదో ఒక వింత ఆవేదన బయలుదేరినట్లుగా తోచింది. అది విచారమని గానీ ఆదుర్దా అనిగాని నిర్ణయించటానికి వీల్లేకుండా వుంది.

పక్కమీద కూచోని కిటికీలోనుండా బైటికి చూచాడు. ఇంకా సూర్యోదయమైనట్లు లేదు. పాలవాళ్లు ఆవులను తోలుకు వచ్చి అక్కడక్కడ వాకిళ్ల ముందునుంచోని కేకలు వేస్తున్నారు. ఆశ్చర్యంతో అతడు "నేనురాత్రి నిద్రపోయినానా, మేలుకొనే పడుకున్నానా?" అనుకున్నాడు.

పనిచేసే మనిషివచ్చి "అమ్మగారూ" అని పిలవటం వినబడ్డది. అతని తలమీద ఒక ముష్టిఘాతము తగిలినట్టుగా తోచింది. ఏదో యోచనలో పడ్డాడు. "అమ్మగారు లేరు" అని దానికి చెప్పాలా?...... ఉంటే యెంత బాగుండేది? వెంటనే లేచిపోయి తలుపుతీసి నిశ్శబ్దంగా పనులన్నీ చేయించుకొనేది. తననిద్రకు భంగంవస్తుందేమోనని పనిమనిషిని రెండో కేక వెయ్యనియ్యకుండా మరివొకమాటైనా బిగ్గరగా మాట్లాడనీయకుండా జాగ్రత్తపడేది. తనకు వేన్నీళ్లు తయారై, పాలు కాగి సిద్ధముగా వున్నతరువాత, మెల్లిగా పక్కదగ్గరకువచ్చి "యెనిమిది గంటలైందండీ" అనేది. అప్పుడు తను నిద్రలేచేవాడు. ఇవ్వాళో......?

"అమ్మగారూ" అని పనిమనిషి మళ్లీ పిలవటం వినబడ్డది. అతడు కిటికీలోనించీ వాకిటివంక చూచాడు. "నాకింకా పిచ్చి వదలలేదు," అనుకొని చివాలున లేచిపోయి తలుపుతీశాడు.

౨

హోటలులో ఆవాళ మెతుకులు సయించలేదు. ఎంత వద్దని మరల్చుకుంటున్నా మనస్సు భార్యమీది ఆలోచనను వదలిపెట్టటంలేదు. "ఇష్టంలేక పంపించివేసిన భార్యమీద ఇంకా ఆలోచన యెందుకు?" అని ప్రశ్నించుకుంటాడు. జవాబు సులభంగా దొరకదు. ఒకవేళ తనమనస్సే తనను మోసంచేస్తున్నదేమో! ఆ అయిదు నెలలూ కాపరం చేయటంవల్ల తన హృదయంలో నిజమైన ప్రేమాంకురాలు యేర్పడ్డవేమో! అవి తాను గుర్తింప గలిగేటంత పెద్దవిగా పెరగకముందే తాను భార్యను పరిత్యజించాడేమో! అందువల్లనే అంత కంగారుగా వున్నదేమో! ఇక ఆ అంకురాలను పెల్లగించివెయ్యటానికి వీలులేదేమో! ఏమో......

ఎట్లాగో భోజనము ముగించి ఆఫీసులో పడ్డాడు. కాని ఆవేళ ఎవరితోనూ సరిగా మాట్లాడ బుద్ధి పుట్టలేదు. పనియేమీ చేయ బుద్ధిపుట్టలేదు. కాగితం మీద కలం పెట్టినప్పటినుంచీ మనస్సు చలించటం

మొదలుపెట్టింది. తన ముఖవైఖరి చూసి తోటివాళ్లే మైనా అనుకుంటారేమో నని మనస్సును బిగ్గబట్టుకోటానికి ప్రయత్నిస్తాడు. అయిదునిమిషాలు నెగ్గుతాడు. తరవాత ఓడిపోతాడు.

ఆలోచనలు పరిగెత్తుకుంటూ వస్తవి. "ఒక్కతే రైలుమీదబడి యింతదూరం వచ్చిందని వాళ్లనాన్న దాన్ని కోప్పడతాడేమో! పడదూ మరి? తానుపోయి దింపిరాగూడదూ?

"తాను తీసుకుపోయి దింపివచ్చేటంత అపేక్షే వుంటే అసలు పుట్టింటికి పంపట మెందుకూ?....

"అది, పాపం, తండ్రిమాటలకు చిన్నబుచ్చుకుని యేడుస్తుందేమో! ఇక్కడ యెంతగా యేడ్చింది! కళ్లువాచిపోయి మొగమంతా యెఱ్రబడినట్లు కనిపించింది. ఆనల్లటి చెక్కులమీద కన్నీరుధారలు పడిపోయినట్లు కనిపించింది. ఆ ముఖవైఖరి తలచుకుంటే తనకిప్పుడుకూడా గుండె పగిలిపోతుంది.

అయినా, ఛీ! అంత నల్లని......"

## 3

రోజులు గడిచినకొద్దీ మనస్సు క్రమక్రమంగా శాంతిపొందింది. జానకిమాటలు, యేడ్పు, జాలిగొలిపే చూపులు, అన్నీ మరచిపోతున్నాడు. అప్పుడప్పుడు సాయంత్రం ఆఫీసునుంచీ ఇంటికి చేరుకోగానే మళ్లీ జ్ఞాపకమొస్తూ వుండేది. దీపంవెలిగించి పత్రిక చేత్తో పట్టుకుని కొంచెం ఆలోచించేవాడు. కాని అందులో "మెట్రిమోనియల్" ప్రకటనలు చూచేటప్పటికి మనస్సు వేరేత్రోవ పట్టేది.

"ఛీ! నేనింకనైనా ఒక నిర్ణయంమీద నిలిచి వుండాలి. ఈ చాంచల్యం యేమిటి?

"సౌందర్యపిపాసచేత పిచ్చివాడినే అయినా ననుకో. పెళ్లి చేసుకున్న భార్యతో నీవు నాకువద్దు, అని స్పష్టంగా చెప్పి పంపించివేశాను. ఇంక మళ్లీ దాన్ని తలచుకోటం బలహీనతకాదా? ఈసారి ఆతలపువస్తే ఆత్మహత్య చేసుకుంటాను," అనుకుని పూరుకునేవాడు.

ఒకనాడు అకస్మాత్తుగా భార్యదగ్గరనుంచీ వుత్తరం వచ్చింది. అంత పని జరుగుతుందని తను ఎన్నడూ అనుకోలేదు. తను మరచిపోయినట్లు ఆమె మాత్రం యింకా మరచిపోలేదన్నమాట. అంత స్పష్టంగా చెప్పివేసినా ఆమెకుమాత్రం యింకా తన మీద విశ్వాసం పోలేదన్నమాట. ఆమె యిప్పటికీ, తన తల్లిదండ్రులు సోదరీ సోదరులమధ్య వుంటున్నప్పటికీ తననేగూర్చి యోచిస్తూ వుందన్నమాట. ఎప్పటికైనా తనువచ్చి మళ్లీ తీసుకుపోతాడనీ తనదగ్గర సుఖంగా కాపరం చెయ్యగలుగుతాననీ ఆమె ఆశ పెట్టుకుని వుందన్నమాట! నిజంగా అట్లా వుంటుందా?

ఎందుకు వుండదు? ఆమె తప్పేమీ లేకపోయె!

ఉత్తరంలో రెండేముక్కలు: "మానాన్న వుండి వుండి పూరికే విసుక్కుంటూ కోప్పడుతూ వున్నాడు. వెంటనే మీరువచ్చి తీసుకొని పోవలెను."

## ౪

భుజంగరావు ఉత్తరానికి జవాబు రాయలేదు. పైగా దానివల్ల అతనిధైర్యం మరింత జాస్తి అయింది. "నన్ను మరచిపో" అనిచెప్పి పంపించిన తరువాత ఆమాట లక్ష్యంచేయక ఇంకా తనకు ఉత్తరం రాస్తుందా? అట్లా ధిక్కరించినదానిని ఇంకా తలచుకోవటమా? అని కోపం తెచ్చుకున్నాడు.

వెంటనే, "నాకువద్దన్న తర్వాత యింకా ఆమె నా ఆజ్ఞయెందుకు పాలించాలి?" అని ప్రశ్నించుకున్నాడు.

"పాలించ దలచుకోకపోతే మళ్లీ నాదగ్గరికేవచ్చి యెందుకు వుంటానని రాయాలి? నాకుభార్యగా వుండ దలచుకుంటే నేను చెప్పినట్లు చెయ్యవద్దూ?

"వుండక యేంచేస్తుంది? వస్తుందా అగ్నిసాక్షిగా పెండ్లిచేసుకున్న భార్య?"

"నేను రాక్షసుణ్ణిరా!" అని ఒక నిట్టూర్పువిడిచి ఆ యోచన బలవంతంగా వదలిపెట్టుకున్నాడు.

ఇంచుమించు యేడాది గడిచింది. ఉండలేక పోయినాడు. ఏమీ తోచిందికాదు. "ఆ నల్లని భార్యనే మళ్లీ తెచ్చుకుందామా?" అనుకున్నాడు.

"నేను వెళ్లి పిలిస్తే వస్తుందా? వాళ్ల నాన్న వొప్పుకుంటాడా? వాళ్ల నాన్నకేముంది? లేక యెవరి దుంది, యేడాదిబట్టీ పెట్టి పోషిస్తున్న వాడికి కాక...

"ఛీ! నేనింత పశువునా? నిజమైన ప్రేమ ఆ కురూపిమీద నాకెన్నడూ కలగదుగదా. ఇదివరకెంత ప్రయత్నించలేదు? విఫలమవుతున్నట్లే అయినానుకదా? ప్రేమలేకుండా దానితో కాపరం చెయ్యటం యెందుకూ? ఇప్పుడు నేను కావాలంటుంది యెందుకో నాకుతెలుసు......ఛీఛీ! నావంటివాడు మృగంకంటే హీనంగా మారుతాడా? ఎన్నడూ జరుగదు. నాప్రాణం యివ్వటానికి సిద్ధంగావుండే అంతప్రేమ యేస్త్రీమీద నాకు కలుగుతుందో ఆమెతోనే నేను కాపరం చేస్తాను.

"పోనీ, అట్లాంటిప్రేమ కలిగించగల మరివొకస్త్రీని, నాకునచ్చిన సౌందర్యవతిని యెందుకు పెండ్లి చేసుకో కూడదు?"

ఆరాత్రల్లా నిద్రపోకుండా ఆలోచించాడు. రెండు మూడు రోజులు పత్రికలలో ప్రకటనలు జాగ్రత్తగా పరిశీలించి రెండు మూడింటికి జవాబులు పంపాడు.

౫

ఆఫీసులో పనిచేసుకుంటూవుండగా ఒక యాభై యేండ్ల పెద్దమనిషి యెవరో వచ్చి "మీరేనా భుజంగరావుగారు?" అని అడిగాడు. అప్పుడే అతనికి భోధపడింది, "అవును. ఏం" అన్నాడు.

పెద్దమనిషి జేబులోనించీ ఒక కాగితం తీసి "ఇది మీరేనా రాసింది?" అని అడిగాడు.

అదిఒక "మెట్రిమోనియల్" ప్రకటనకు భుజంగరావు రాసిన జవాబు. దానివంకా ఆ పెద్దమనిషి వంకా ఎగాదిగాచూచి "అవునండి, ఇవతలికిరండి మాట్లాడుదాం" అని ఆయనను వేరే ఒక ఖాళీ గది లోకి తీసుకెళ్లాడు.

"అయితే మీకేమీ అభ్యంతరంలేదుగద?" అన్నాడాయన.

భుజంగరావు కనుబొమలు చిట్లించి, "వితంతువని నాకేమీ ఆటంకంలేదు. మీ అమ్మాయేనా?" అన్నాడు.

"అవును. మరిమీవాళ్లు ఒప్పుకుంటారండీ?"

"మావాళ్లెవరూ ఈ సంగతిగూర్చి ఆలోచించక్కరలేదు."

"మరి పెండ్లికెవరూ రారా?"

"ఊఁ హుఁ."

పెద్దమనిషి మాట్లాడకుండా అతనివంక చూడటం మొదలు పెట్టాడు.

"అయితే బాలవి...." అని భుజంగరావు అడగబోగా ఆయన "అవును కార్యం కాకముందే వాడు పోయినాడండీ."

౬

పిల్ల బాగానేవుంది. కాని పదిహేనేళ్లంటే అంతగా నమ్మదగినట్లు కనబడలేదు. భుజంగరావు కొంత ఆలోచించాడు. "అయినా అన్నీ కావాలంటే యెట్లా వస్తవి?" అనుకున్నాడు. పిల్ల మరీ పెద్దదే అని యేదో ఒకవింత సంకోచం తోచింది అతనికి. కాని తను కోరుతున్నది చక్కని రూపం కదా. అది లభించింది. అతని కాంక్షావేగము కొంత

కమించినట్లుగా తోచింది. ఎన్నడూ యెరుగని ఆనందాంకుర మేదో మనస్సులో మొలకెత్తినట్లనిపించింది. "ఇది నాదే" అనుకున్నాడు.

"రేపు మీరు మా యింటివైపు ఒకసారివస్తే నిర్ధారణగా చెప్పివేస్తాను" అని ఆ పెద్దమనిషితో చెప్పి ఆఫీసుకు వెళ్లిపోయినాడు.

ఆనా డతని మొగము మీదేదో వింతకళ ఒకటి కనబడివుంటుంది. ఆఫీసులోనివాళ్లంతా అతనివంక విచిత్రంగా చూడటం మొదలుపెట్టారు. ఇంటిదగ్గర కూడా చూచినవాళ్లలో ఆశ్చర్యం వెలిపుచ్చే చూపులతో పలకరించారు. "ఏం అట్లావున్నావు?" అనికూడా ఒకరిద్దరు అడిగారు. కాని అతనేమీ జవాబియ్యలేదు. "ఒంట్లో బాగాలేదుట్రా?" అని ఒక స్నేహితు డడిగాడు.

భుజంగరావు "ఏం? బాగానేవుందే!" అని అతణ్ణి తప్పించుకుని పోయినాడు.

స్నేహితు డంతటితో వూరుకోక "వియోగం అనుభవిస్తున్నావా?" అని మెల్లగా అంటించాడు.

భుజంగరావు అతనివంక చురచురా చూచి దూరంగా వెళ్లిపోయినాడు. కాని ఆమాట అతని మనసులో అంటుకుపోయింది. మొదట "ఈ వెధవలకందరకూ నా సంగతి యెందుకు?" అనుకున్నాడు. కాని మనస్సు ఆగలేదు. "వీళ్లందరకూ తెలేని దేముంది? ఊరుకుంటారా మరి? నాతో అనకపోతే మటుకు వాళ్లల్లో వాళ్లనుకోరూ? భార్యను వదిలిపెట్టాడనే అప్రతిష్ఠ రాకుండాపోతుందా? అందులో జానకివంటి యేతప్పు చేయనిదాన్ని.........

"ఛీ! నాకు మళ్లీ పిచ్చ యెత్తుతూవుంది. నా ఆకాంక్ష తీరవద్దా? నాకు సంతృప్తి కలుగవద్దా?...

"నా సంతృప్తిని యెవరు గణిస్తారు? ఒక ప్రాణిని అన్యాయంగా కష్టపెట్టాననే చెడుపేరే చెప్పుకుంటారు గాని.........

"వాళ్లు చెప్పుకుంటే యేమి? వాళ్లతో నాకేమి? ......"

౭

ఆరాత్రి చాలాదీర్ఘంగా తోచింది అతనికి. జీవితములో యెన్నడూరాని ఒక క్రొత్త అనుభవ మేదో ఆనాడు వచ్చినట్లుగావున్నది. స్నేహితులను లోకులనుగూర్చి అతడంతగా యెన్నడూ ఆలోచించి యెరుగడు. తన అంతరాత్మకంటేగూడా వాళ్లు బలవంతులుగా కనబడుతున్నా రప్పుడు. నిద్దురరాక పక్కమీదలేచి కూచున్నాడు. రాత్రి ఒంటిగంట అయిందేమో. కిటికీలోనించి ఆకాశంవంక చూచాడు. చీకటిలో ఒక్కొక్క నక్షత్రమూ తనను వెక్కిరిస్తున్నట్టుగా తోచింది.

"ఇప్పుడే ఇంతగావుంది, మళ్లీ పెళ్లిచేసుకుంటే యిక వూరుకుంటారా? ఎంత పరిహాసమో......

"అయినా, యెవరికీ తెలీకుండా చేసుకుంటాను. జానకినే మళ్లీ తెచ్చుకున్నట్టుగా పైకి కనబడేటట్టు చేస్తాను......

"లోకం కండ్లు యెన్నాళ్లు మూయగలము?.....

"జానకి యేమౌతుంది? అది సంపాయించుకో లేదు గదా? పెద్దది తండ్రియింట్లోవుంటే దాన్ని కూడా లోకులు నన్నన్నట్లే యేమేమి అంటారో!... ఛీ, దానిమీదాగూడా చెడుమాటలు చెప్పుకుంటారా? ఎన్నటికీ జరగదు......

"నేను పెండ్లి చేసుకున్నానని తెలిస్తే అది యేమనుకుంటుందో! ఇక్కడికి వస్తుందేమో! అప్పుడు ఇది యేమౌతుంది? మోసంచేశానని తెలిస్తే ఊరుకుంటుందా? గోలచేస్తే? వీళ్ల నాన్న వూరుకుంటాడా? వాడు వూరుకుంటాడా? ఆఫీసుకు వస్తే!......"

అప్రయత్నంగా అతడు పక్కమీద పడిపోయినాడు.

౫

మరునాడు పెద్దమనిషి వచ్చేటప్పటికి భుజంగరావు పడకకుర్చీమీద కూర్చొని చదువుకుంటున్నాడు. ఆయనవంక చూచి పలకరించనైనా లేదు. ఆయన నిర్ఘాంతపోయినాడు.

కొంచెంసేపు తలవంచుకొనేవుండి "నేను చాలా పనిమీదవున్నానండీ" అన్నాడు భుజంగరావు. ఆయన నొచ్చుకుని "అయితే మీ ఉద్దేశం యెట్లావుందో చెప్పేసెయ్యండి" అని ఖచ్చితంగా అన్నాడు.

భుజంగరావు తలయెత్తకుండానే "మీరు వేరే విచారించుకుంటే మంచిది" అన్నాడు.

పెద్దమనిషి తిరిగిచూడకుండా వెళ్లిపోయినాడు.

ఆనాటినుంచీ భుజంగరావులో క్రొత్తమార్పు వచ్చింది. మనస్సును సంపూర్ణంగా వశంచేసుకొని ఆఫీసుపనిమీదే సర్వశక్తులూ కేంద్రీకరించి ఉపయోగిద్దామని ప్రయత్నంసాగించాడు. స్వసుఖమనే ఆలోచనే రానీయకుండా వుందామని.

ఇంటిగోడలమీద అందమైన పటాలన్నీ తీసి పెట్టెలో దాచేశాడు. రోజూ చేతిలో ఎంత డబ్బు ఖర్చవుతుందో వ్రాసుకోటం మానేశాడు. ఆహారం యెంతైనా ఆలోచనలేకుండా యెప్పుడుపడితే అప్పుడు తినటం. ఇతరులతో రాజకీయవిషయాలూ ఆఫీసువిషయాలూ తప్ప మరేమీ మాట్లాడడు.

౬

మరి మూడునెలలు గడిచినవి. జానకిమాత్రం అప్పుడప్పుడు జ్ఞాపకంవచ్చేదే కాని అంతగా మనస్సును బాధించేదిగాదు. తనలోతానే కొంచెంగా నవ్వుకుని వూరుకుంటుండేవాడు.

ఒకనాడు ఆఫీసులోవుండగా బండిమనిషి ఎవడో వచ్చి తన పేరుగల చీటీ వొకటి తెచ్చియిచ్చాడు. ఆశ్చర్యపడి "ఏమిటిది?" అన్నాడు.

"మీ బంధువులటండీ రైలుదగ్గర వున్నారు. మిమ్మల్ని రమ్మన్నారు" అన్నాడు బండివాడు.

"ఎవరు?"

"ఆడవాళ్లండీ......"

అదిరిపడి భుజంగరావు మేనేజరుతో "ఇప్పుడే వస్తా"నని చెప్పి బండివాడితో రైలుదగ్గిరికి వెంటనే వెళ్లాడు. గేటుదగ్గర ఒకపక్కగా నిలబడ్డ బండిలో జానకి కూర్చొనివుంది. భుజంగరావుకు కోపం వచ్చింది. కాని అక్కడ యేమీ అనగూడదను కున్నాడు. వెంటనే బండిని తన యింటిదాకా తోలించుకుపోయినాడు.

బండివాడు పెట్టెను వసారాలో పెట్టి భుజంగరావువంక చూడగా జానకి తన కొంగుముడివిప్పి తానే వాడికి డబ్బిచ్చి పంపి వేసింది.

భార్య నేదో అడగాలని అనుకున్నాడు మొదట. కాని మళ్లీ మాట్లాడ బుద్ధిపుట్టలేదు. ఇంట్లోకీ బయటికీ యేదో పనివున్నట్టుగా ఒకసారి తిరిగాడు.

"మళ్లీ ఆఫీసుకు వెళ్తారా యిప్పుడే?" అన్నది జానకి నిర్భయంగా.

ఆశ్చర్యమూ కోపమూ అతడ్ని మింగివేసినవి. "నా అనుజ్ఞలేకుండా మళ్లీ యిట్లావస్తుందా?" అని తనలో అనుకుని మండిపడ్డాడు. చీలుద్దామా అనుపించింది. కాని తలయెత్తి ఆమెవంక చూడనైనా చూడకుండా యెకాయెకిని ఆఫీసుకు వెళ్లాడు.

రాత్రి యింటికి వచ్చేటప్పటికి దీపము వెలుగుతున్నది. ఇల్లంతాకడిగి ముగ్గువేసివుంది. అదివరకు చెల్లాచెదరుగా పడివున్న సామానంతా యెక్కడిదక్కడ సరిగా అమర్చబడివుంది.

"నీళ్లు కాగినయి, స్నానం చెయ్యండి" అన్నది జానకి.

గిర్రునతిరిగి అతడు పడకటింటిలోకి వెళ్లిపోయినాడు. ఆమెతో మాట్లాడదలచుకోలేదు.

తనపక్క పరచబడి ముడుతలు లేకుండా శుభ్రంగా వుంది. దానిమీద కూచున్నాడు.

జానకి గడపదాకావచ్చి నుంచుని జంకుతూ "మీరు......" అని యేమో అనబోయింది.

"నేను హోటలులో భోంచేసివచ్చాను. పో" అని మొహం తిప్పుకున్నాడు భుజంగరావు. జానకి వెళ్లిపోయింది.

అతని కేమీ తోచలేదు. ఇల్లు వదిలేసి యెక్కడికన్నా లేచిపోదామా అనుకున్నాడు. "మళ్లీ యిదే దాపురించిందే! ఇది వదలదు" అనుకుని పక్కమీద పడుకుని కండ్లు మూసుకున్నాడు.

జానకి తలుపులన్నీ వేసి వస్తున్నట్లుగా చప్పుడు వినబడ్డది. అతడు కండ్లు తెరవలేదు. ఆమెవచ్చి దూరంగా చాపవేసుకుని కూర్చుంది. అతడు కదలలేదు. దీపము చిన్నదిచేసి పడుకుంది.

భుజంగరావుకు మెలకువలోనే యేవేవో కలలు వస్తున్నట్టుగా తోచింది. కండ్లుతెరిచి చూచాడు. జానకి తనవంకేచూస్తూ పడుకునివుంది.

మెల్లగా "ఎందుకు వచ్చావు?" అన్నాడు. ఆమె మాట్లాడలేదు.

అతడు వేరేప్రక్కకు తిరిగి పడుకుని పూరుకున్నాడు. కాని మనస్సు నిలవలేదు. చివాలునలేచి వంటింటిలోకిపోయి మంచినీళ్లకోసము వెతకసాగినాడు. జానకి లేచివచ్చి తన చేత్తోనే యిచ్చింది.

"నిన్ను రమ్మని రాయలేదు గదూ?" అని ఆమె భుజముమీద చెయివేసి ప్రశ్నించాడు.

జానకికి కళ్లనీళ్లు గిర్రున తిరిగినవి. అతని రొమ్ముమీద తలఆనించి వెక్కివెక్కి యేడవటం మొదలుపెట్టింది.

భుజంగరావు ఆమెను చేయిపట్టుకొని మెల్లగా తీసుకువెళ్లాడు. తన పక్కమీద కూర్చుని ఆమె రెండు భుజములమీద చేతులువేసి "ఏడవ్వాకె" అన్నాడు.

*　　*　　*　　*

"ఎనిమిది గంటలయిందండీ" అని భార్యమాట వినపడితే లేచి కూర్చున్నాడు భుజంగరావు. కిటికీలోనించీ సూర్యకిరణాలు వచ్చి పక్కమీద పడుతున్నవి.

---

# తిక్కన 'సుధేష్ణ'

శ్రీ పుట్టపర్తి నారాయణాచారిగారు

మహాకావ్య మొక విశాలగంభీరమగు సముద్రమువంటిది. దానిని చేయూతనీదుటయు, అందున సైయనిపించుకొనుటయు దుస్తరము. వ్రాయుచున్నపుడు పదే పదే తలమలపి చూచుటకుఁగాని హెచ్చు తగ్గులనొత్తి యతికి సవరించుటకుఁగాని వీలుదొఱుకదు. ఒకవేళ కవి జాగరూకుఁడై గమనించినను పూర్తిగా నేరిపోయలేఁడు. కనుచూపుమేరకు కథాభాగమే గనఁబడుచుండును. అట్టియెడ అంగాంగములఁ బరీక్షించుటకు సామాన్యసృష్టికర్తకు సాధ్యమగునా? అయిన సంపూర్తిగా నసాధ్యమేనా? అసాధ్యమనిగాదు నేఁ జెప్పవచ్చినది. అరుదనిమాత్రమే. అందుకైఁ బ్రయత్నించి కొంతవరకు పాకమునకుఁ దెచ్చిన వానినే "మహాకవి" యందుము. అలంకారికులీ "సార్వత్రికదృష్టిని" గురించి పలుమారు బ్రస్తావించిరి. ఆవశ్యకములగు అంగములలో దానికి ప్రధానపట్టముఁగూఁడ గట్టిరి. మొత్తముపై నిది కత్తిపైని సామే. రసమునకు పరవశుఁడై నడచు కవి కూలంకషమగు ధారను మందగించి ఆత్మవిమర్శనఁ గావించుకొనుటయనఁ బిల్లాటగాదు కదా!

చాలవరకు మన కవులు చీకాకుపడిన ఘట్టములలో నిది యొకటి. వారు ప్రధానదృష్టిని నాయకునియందే లగ్నము గావింతురు. ఇతరములగు పాత్రము లేగతిఁ బట్టినవిరాయుని విచారించుట మిక్కిలి యరుదు. లేనేలేదన్నను అంత దోషము గాదేమో! భట్టనారాయణుఁడు గొప్ప రచయితయట. నాటికములయందలి లక్షణము లిందు బాగుగా సమన్వయించునని అలంకారికుల "సర్టిఫికెట్టు"లున్నవి. కొన్ని ఘట్టములు కొంతవరకు కొందరికి నచ్చవచ్చును. కాని కథాభాగమునకుఁ బట్టిన యవస్థ! వాడి వత్తలై వంకలు దిరిఁగినది. ప్రతినాయకుఁడగు దుర్యోధనునకుఁ బట్టిన గతి భీముని గదాఘాతమునకన్న పెద్దది. కాళిదాసునకును, భాసునకును దక్క మరియొకరికీ యాస్థయు దృష్టియు నుండెనా యని సందేహపడవలసియున్నది.

ఈ పరిపాటికి నాదృష్టికి రెండుభాషలలో సాటిలేనివాఁడు తిక్కన. అతని భారతమునుఁ జదువునపుడు సామాన్యములగు వాటి నటుండనిచ్చి అల్పాల్పములగు పాత్రములకును జిలికించిన కాంతిని గమనింప వీలుగలదు. హృదయమును తిన కనుసన్నల మెలఁగఁజేయు యోగి తిక్కన మహాకయుఁడు.

నిజముగా విరాటపర్వమున సుధేష్ణపాత్ర కంటికి గానరాని నలుసు. అందులో సమగ్రభారతమును పూరింపఁ దొరకొను కవికి, సుధేష్ణపాత్రకనులకే గోచరింపదు. వేరొకఁడే భారతమును రచించియున్నచో నేడు "నానా రసాభ్యుదయోల్లాసి" యని

మనము పొంగిపోవు విరాటపర్వ మేగతిఁ బట్టియుండునో. వేరుగతి బట్టినవియు నున్నవి. చూచి గమనింపఁదగును. అసలు వ్యాసుడే, సుధేష్ణ, అపరిమిత మేధశ్శాలిని, అనుభవశాలిని, గుణవతి యని గ్రహించియుండలేదు. మన తిక్కన యట్లుగాక మంచి చెడ్డలు రెంటను వివరించినాఁడు. ప్రమాణమునఁ జిన్నదియైనను నిత్యవర్చస్విని సుధేష్ణగాథ. ఇట్టివానినిఁబట్టి భారత రచనమునఁ దిక్కన దృష్టి యెంత సమగ్రమైనదో మన మూహింపవచ్చును.

సుధేష్ణ మేడతుదినిలువున నుబుసుపోకకు దిరుగాఁడుచున్నది. చెలికత్తె లిరువంకఁ గొలుచుచున్నారు. చిత్తమునందు నిర్విచారత, యుల్లాసము తెరలై పొరలిపోవుచున్నవి. ఒకసారి జాలకములఁ దొంగి చూచినది గాబోలు. వెంటనే దారినివచ్చుచున్న సైరంధ్రి యామె దృష్టి నాకర్షించినది. అతిమానుషమగు సైరంధ్రి రూపమునుఁ జూచినవెంటనే యామె మనుష్యకాంత గానోపదని నిర్ణయించినది. అయిననా మాటలేమి! నీచభాగులవలె భాషించుచున్నదే! దీనిపై కార్యకారణవిచారణ మామె మనసునకుఁ దట్టినది. ఆవితర్కము సందేహమునకుఁ జోటిచ్చినది. సందేహము కుతూహలతనుఁ బెంచినది. సైరంధ్రిపై గారవము, ఆదరముఁ గడలుకొన్నవి. కాని యన్నిటికి భిన్నమై సందేహముమాత్రము ముందు నిలిచినది. కనుగొందమను తలఁపున మాటలలో నారితేరిన "ప్రౌఢాంగన"ల నిరువురఁ బంచినది.

సైరంధ్రీపాత్రధారిణియగు ద్రౌపదికి రొట్టెవిరిగి నేతిలో బడినట్లైనది. "సాముఖ్యము, సంభావనయు" గల యామగువవారివెంట "వినయవైభవము సతీతనువొందిన చందమున" వెడలినది. తన్నుఁ దరిసినవెంటనే మనస్వినియగు సుధేష్ణ గారవము మొగమునను, కేలపురఃప్రసారమును దంతమరీచులసామినిర్గమమును గడలుకొనగా వానిపై నాదరరేఖ యనుఁ బూఁతఁ బూసి, గద్దియజూపి "యిందురమ్మని" సైగఁజేసినది. మరియాద నెఱిఁగిన గఱితసైరంధ్రి "అంతనంతల" వినీతి నిల్చినదట. సుధేష్ణపరీక్షాదృష్టి మానలేదు. కుతూహలము, సందేహము పరస్పరముఁ బెనఁగొన్నవి. కడ "కుచితమ య్యెడు భంగి" ప్రశ్నించినది. ఆ తిక్కనమాట వరాలమూట. ఊహసేయలేనంతటి భావములఁ క్రోడీకరించుకొన్నది. కార్యజ్ఞురాలును, యుక్తిచతురయునగు సైరంధ్రి అసామాన్య. ఆమెపలుకు పాశుపతము. తొలుఁత మెలుఁకుగుల వెట్టఁక తిన్నగా ఉన్నదున్నట్లు తన వృత్తాంతమునుఁ దెలిపినది. దానిలో సుధేష్ణ యనుమానముపోవునా? సురగరుడోరగకాంతలలో నొక్కతెగాని, మనుష్యకాంత గాదని నిర్ధరించినది. అయిన నీ రహస్యమునుఁ జెప్పించుటెట్లు! అమేయప్రతిభారాశియగు సైరంధ్రి ముందు సుధేష్ణయెత్తు కుప్పిగంతులైనది. భావశబలతచేఁ జకితయై యూహాప్రపంచమున బారలు జాచుచున్నది. అసందు గనిపెట్టి సైరంధ్రియు "దరహాసితము మోమునకుఁ దొడవుగాగ"

కథకు వన్నెలు చిన్నెలుదీర్చి, నగిషీపని జేసి, సుధేష్ణను పూర్తిగా భ్రమపెట్టె ఊ యనుమన్నది.

కాని సుదేష్ణ మనసెట్లును పాలుపోవుట లేదు. ఒకవంక నుత్కృష్టమగు రూపము, ప్రవర్తనలోని నాణెము, మాటలతీరు, గంధకారికావేషము, ఒకటికొకటి సందర్భింప నేరకున్నవి. పైగా సైరంధ్రి తన ప్రతిభారాశిలో ముంచియెత్తుచున్నది. అదియును గాక ఆ సైరంధ్రి తనయింటనే యుండ వచ్చుట లోకజ్ఞురాలగు నామెకు మరింత భయకారణము. తన తమ్ములు నూరుమంది. బాహుబలగర్వితుఁడును, రూపాభిమానియునగు కీచకుఁడు మదికెఁ దట్టినాఁడు. పురుషుల స్థైర్య మెంతపాటిదో యామెకుఁ దెలియనిదిగాదు కదా! కీచకుని విషయ మెట్లున్నను, ముసలిరాజే ముందుఁబడినచో తనగతి యేమి? సుధేష్ణకు గుండెలు నీరైనవి. తటాలున నామె గభీరహృదయము నుండి యీమాటలు స్పష్టముగా రాజసమును, బిడియమును, గారవమునుఁ దెమలించుకొని బైటఁబడినవి. దీనిచే నా యనుమాన మెంత గాటముగా నామె మనసంటి యుండెనో మన మూహింపవచ్చును. సామాన్యస్త్రీ హృదయ మచ్చొత్తినట్ల ఆ మాటలలో గోచరించుచున్నది. పండితు లేమందురో కాని అనుభవరసికుల కం దౌచిత్యమేయున్నది. రాచకూతురి కాచితియు, సందర్భశుద్ధియు, వశిత్వమును నుండఁదగుననుట న్యాయ్యమే. కాని నా మనవి యేమన సుధేష్ణ యతిలోకయగు పతివ్రతగాని ప్రతిభారాశిగాని కాదు. సామాన్య రాజకుటుంబమునకుఁ జేరినది. స్త్రీసామాన్యములగు గుణములన్నియు నుండ కెటుఁబోవును? పైగా ననుభవజ్ఞత, కార్యచతురత, తిక్కన యీ సంసారికి తీర్చిన మెఱుఁగులు. మనము ప్రతిదినముఁ జూఁచువారివంటిదే గాని సుధేష్ణ అరుదుగా ననుకొనఁదగినదియు, నిరంతరము పూజలందఁదగినదియు గాదు. ఇటుఁదీర్చు తెలుఁగు లోకపు మఱుఁగు నెఱిఁగి చరియించు గేస్తురాలు. స్వభావము దుర్నివారముగదా! ఆమె యిటులన్నది.

మ॥ ......ప్రభూతాశ్చర్యరై యిట్లనున్
వినునీరూపముఁజూఁచి యీనృపతియు
    వ్విహ్లాదు వేనెమ్మెయిన్
దనిగొందున్ దగనింతులన్ దగిలి నీ
    పైఁ జూడ్కి నెక్కొల్పి నె
మ్మనము ల్విస్మయమంద జూచెదరు భా
    మాపల్కు లింకేటికిన్

క॥ దుర్భరయగు నినుఁగర్కటి
గర్భముధరియించునట్లు గైకొనినాకై
నిర్భరవిధ్వంసదశా
విర్భావముఁ దెచ్చుకొనుట వెరవై యున్నే?

పైవాక్యము లెంత యుక్తియుక్తములుగానున్నవి! వానిఁ జదువునపు డొకింత మఱుఁగుగా జెప్పియున్న సుధేష్ణశీలమునకు బాగుండెడిదేమో యను కొతుకుదప్ప మరియే వైకల్యమునులేదు. కాని ఆసమయ మట్టిది. ఈస్పష్టతచే నీ యనుమాన మామె

కెంత తీవ్రమైనదో గ్రహింపవచ్చును. సైరంధ్రీరూపమును సాటివారగు స్త్రీలు గూడ "దగిలిచూఁడ" నిక మగవారి నడుగ వలెనా? ఇక విరాటుఁడేమి, విశ్వామిత్రుఁడా భీష్మించుటకు! ఒకవేళ పరవశుఁడగు రాజు చెడుత్రోవఁ ద్రొక్కిన తనబ్రదుకు "కర్కటి గర్భ"మగుటలో సందేహముండునా? ఇక సైరంధ్రిమాట యెవరెఱుఁగుదురు! ఇంతకు నింద్రియములు బలవత్తరములు. అట్టియెడ "నిర్భరవిధ్వంస దశావిర్భావము" గాక మరేదియైనదట్టునేమో యోచింపుఁడు.

సైరంధ్రి యామెకొఱఁతఁ గనిపెట్టినది. ఆమె చాతుర్యము, ఆత్మశక్తి యిపుడు బయటఁబెట్టకున్న గతియేది! "నా చిత్తము తాదృశులకు గోచరమే" యని నిరసన హాసము గావించినది. "అస్మదీయకుల జన సంశిక్షాచారమహిమ యట్టిదియా" యని కౌలీనతను చూచాయఁగాఁ గానిపించి, యాభిజాత్యము పురస్కరించినది. "తద్విధాతిహీనవచనము" లని యసహ్యించుకొన్నది. "అట్టివి చెప్పకు" మని మందలించినది. పతుల సమాచారము వివరించి వెన్నుబలమును గంధర్వులని యుదాత్తతను బ్రకటించినది. పైగా ప్రపంచమును సామాన్య హృదయములను గురుతించిన యనుభవరాశి సైరంధ్రి. తను మన్నన తోడ నరయువారికి తన పతులు బాసటయై నిల్చి సాయముఁగావింతురని యాశఁ జూపినది. ఒకటివెంట నొకటి జ్యోతిశ్చక్రములఁబోలు పలుకులు ధారావాహికముగాఁ బ్రవహించినవి. ఇక సుధేష్ణప్రతిభ నిలుచునా? తలపంకించి, యోచించి, పరవాలే దనుకొన్నది. కుతూహల మొకటియున్నది గదా మనస్వితత్వముతోఁబాటు. అంతిపుర ముననుండఁ బనిచి సంతసిల్లినదట. కాని కన్నుమాత్రము సైరంధ్రిమీఁదనే.

ఇంకా వుంది

# సంగీతము

శ్రీగాలి పెంచల నరిసింహరావుగారు
మ్యూజికల్ డైరెక్టరు

మనసానందినిరాగము—ఆదితాళము

ఆరోహణ:—సగమపదనిస } ,, సా ప్ర ,, షు కై ,,
అవరోహణ:—సనిదపమగస } స గ మ ప ద ని స

44-వ మేళకర్తయగు "భవప్రియ"యందు జన్యము
వ్రేలికి నాలుగు అక్షరములచొప్పున ఘాతనుండి రెండు అక్షరములు
తోసి పాడుకొనవలయును

పల్లవి. ఆశచేత ప్రతిమానవు డీధర—ని
రాశ జెందుగదవే మనసా. ఆశ.

అనుపల్లవి. పాశబద్ధుడై పరమార్థమువిడి
దోసములకు పాల్పడు టెందులకే. ఆశ.

చరణము. కర్మానుభవముచే యింద్రియములు
మర్మములకు లోనై యుండుటచే
ధర్మాధర్మ వివేకశూన్యుడై
నిర్మాతను నిందించుమానవుడు. ఆశ.

| | | | |
|---|---|---|---|
| పల్లవి. | ,,: పా,ప పా,,పా పాపా | ,,మపాదపా | మాగా సాసా |
| | ఆ,శ చే,,త ప్రతి | ,,మఆనవు | డీ ఈ ధ ర |
| | నీ: నీ,స గా,,సా గామా | పా,,—,, ,, | మపదప మగామ |
| | ని: రా,శ జెం,,దు గద | వే,,—,, ,, | మఅనఅ సఅఅ |
| | ,,: పా,ప మా,,పా పాపా | ,,మపా,మపదప | మాగా సాసా |
| | ,,: ఆ,శ చే,,త ప్రతి | మఅ,నఅవుఉ | డీఈ ధర |
| | నీ: నీ,స గా,,సా గామా | పమగమ పదనిద | పదపమ పమగస |
| | ని: రా,శ జెం,,దు గద | వెఎఎ ఒఒఒఒ | మఅనఅ సఅఅఅ |
| | గమ: పా,ప పా,,మా గామా | పదపని దపమగ | పమగస గసనిస |
| | అఅ: ఆ,శ చే,,త ప్రతి | మఅఅఅ నఅవుఉ | డిఇఇఇ ధఅరఅ |
| | సా: నీ,స గా,,సా గమపా | పమగమ పదనిస | గసనిద పమగస |
| | నీ: రా,శ జెం,,దు గఅద | వెఎఎ ఒఒఒఒ | మఅనఅ సఅఅఅ |
| | గమ: పా,ప పా,,పద పమగమ | పా,, ,, ,, | ,, ,, ,, ,, |
| | అఅ: ఆ,శ చే,,తఅ అఅఅఅ | ఆ,, ,, ,, | ,, ,, ,, ,, |

# ప్రేమ

పాశ్చాత్య ప్రపంచంలో ప్రేమనుగురించి వాడుకలోవున్న కొన్ని సామెతలు; ప్రబుద్ధుల ప్రవచనాలు. కొన్నింటికి అవివాడే జాతిపేర్లుకూడా కడపట యివ్వబడ్డాయి.

●

యువకుని ప్రేమ జల్లెడలోని నీరులాంటిది—స్పానిష్.

ఎవరికైనా ప్రేమను ప్రారంభించడానికి సామర్థ్యంవుంది కాని ముగించడానికి శక్తిలేదు.

మధురమైన, అమాయికమైన అంగీకారమే ప్రేమను దృఢపరుస్తుంది.

ఎపుడూ ప్రేమించడమే పెళ్లి మాత్రంలేదు—ఫ్రెంచి.

మధురమైన ద్రాక్షరసం మత్తుకలిగించే సారాయి అయినట్లే గాఢమైన ప్రేమ బద్ధవిరోధ మౌతుంది.

ప్రేమలోవుండే 'నిజమైన అబద్ధాలను' చూచి 'జోవ్' నవ్వుతుంటాడు.

ప్రేమిస్తూవుండు; నీ కితరుల ప్రేమ ఎపుడుకాని తక్కువగా వుండదు—ములాక్.

అసలు ప్రేమించకుండా వుండడముకంటె చెడ్డగానైనా ప్రేమించడము మంచిది—కాబ్.

నీలంగావుండే కళ్లు 'నన్ను ప్రేమించు లేకపోతే చస్తాను' అనేరకం; 'నల్లనికళ్లు ప్రేమించు; లేకుంటే నిన్ను చంపుతా' ననేరకం—స్పానిష్.

తిన్నతూపోతే ప్రేమ తగ్గిపోతుంది—ఫ్రెంచి.

ఎలుక పిల్లిని ప్రేమింప గలుగుతుందా?

అను గుణ్యత ప్రేమకు మూలాధారము.

భయముతోటి భక్ష్య భోజ్యాదులకంటె ప్రేమతో పెట్టే పిడికెడు మెతుకులు శ్రేష్ఠము.

గౌరవము, ప్రేమ అన్మకానికి ఎపుడూ దొరక లేదు.

ఎపుడూ విసరుతూవుంటే నిప్పు, ఎపుడూ బలవంతము చేస్తూవుంటే ప్రేమా అభివృద్ధి పొందవు.

ప్రేమను వెంబడిస్తే నిన్నువదలి అది దూరంగా పరుగెడుతుంది; ప్రేమనుండి నీవే పరుగెత్తితివా అది నీవెంబడి పడుతుంది.

ఎద్దుమీది ప్రేమచేతనే తోడేలు కాడిని నాకుతుంది—కాటలాన్.

ప్రేమకొఱకే తోడేలు గొఱ్ఱెను తింటుంది—జర్మన్.

దాదిమీది ప్రేమచేత శిశువును ముద్దాడుతారు.

నిర్బంధముంటే ప్రేమ ఎంతోకాలం నిలువదు—డచ్చి.

అదృష్టము, ప్రేమ గ్రుడ్డివి.

ఇతరులను అసహ్యించుకుండేదానికంటే సాధారణంగా, మనలనే యెక్కువగా ప్రేమించుకుంటాము.

గాఢంగా ప్రేమిస్తే త్వరగా ప్రత్యపకారానికి ప్రోత్సహిస్తుంది.

బాధలను భరింప శక్తిగలవాడు బాగా ప్రేమింపగలుగుతాడు.

ఎపుడూ మరువనివాడే బాగా ప్రేమిస్తాడు—ఇటాలియన్, స్పానిష్, పోర్చుగల్.

తనకు తానే ప్రేమించుకునే వానికి శత్రువే వుండడు—ఫ్రాంకులిన్.

హృదయంలో ప్రేమవుంటే గమనంలో త్వరితం వుంటుంది.

ప్రేమ వివేకానికి స్వస్తిచెపుతుంది — లాఫాంటెయిన్.

'Glass'లో 'g' లేకుండా మిగిలినదాన్ని ప్రేమించేవాడు దాన్లో 'l' లేనివాడవుతాడు.

లేనిచోట ప్రేమను బలవంతంగా పుట్టించాలని ప్రయత్నించేవాడు దద్దమ్మ.

తన్నుతానే యెక్కువగా ప్రేమించుకొనువాడే ఉత్తముడు.

గాఢంగా ప్రేమిస్తే త్వరగా మరుపుకురాదు—స్పానిష్.

పరిపూర్ణంగా ప్రేమించిన వ్యక్తి యెపుడూ విధేయతతో వుంటుంది.

ప్రేమలోని గొప్పదనము మానములోవుంది—మాసింజరు.

నేను ఏవగించుకోలేను. నాకు ప్రేమింపక తప్పింది గాదు—ఓవిడ్.

మిత్రులను ప్రేమిస్తాను. అయితే వారందరకంటే నన్ను నే నెక్కువ ప్రేమించుకుంటాను—ఫ్రెంచి.

నేను నిన్ను ప్రేమిస్తున్నా. కాని నా జోబు మాత్రం తాకకు.

ప్రేమించే వ్యక్తి సౌందర్యనిర్ణయంచేసే స్థితిలో వుండదు.

నీవు ప్రేమిస్తే పర్వతానికి పరుగెత్తు—టర్కిష్.

నీవు నన్ను ప్రేమిస్తుంటే నీ చేష్టలే నాకు దాన్ని చెపుతుంటాయి—స్పానిష్.

నిన్ను నీ వెక్కువగా ప్రేమించుకుంటే నిన్ను ప్రేమించేవారెవుండరు.

ప్రేమవ్యవహారాల్లో, వేటలో నీ యిష్టమువచ్చినపుడు ప్రారంభిస్తావు; సాధ్యమైనపుడు మానేస్తావు.

ప్రేమయుద్ధాల్లో పారిపోయేవాడిదే విజయం.

నీ వేలాచచ్చినా ఒకటే: రోగముచేతనైనా, ప్రేమచేతనైనా—ఇటాలియన్.

ప్రేమతో చావడానికి వీలులేనంత గాఢంగా ప్రేమిస్తావుంది—ఫ్రెంచి.

అందంవుండి "ఎందుకు ప్రేమింపబడుతున్నాం?" అని అడగడము గ్రుడ్డితనం—డానిష్.

బాలిక ప్రేమకు మూలమౌతుంది.

ప్రేమలో ఎంత అమృతం వుందో అంత విషం కూడావుంది—పాటన్.

ప్రేమ, దగ్గు, పొగ, డబ్బు వీటిని చాలాకాలం దాచివుంచడం సాధ్యంకాదు—ఫ్రెంచి, ఇటాలియన్, జర్మన్.

ప్రేమ అన్నికార్యాలు చేయగలుగుతుంది—పెట్రార్క్.

అందరిని ప్రేమించు, కొందరినే నమ్ము, ఎవరికీ ద్రోహం చేయవద్దు—షేక్స్పియర్.

ప్రేమ, విశ్వాసము కార్యాల్లో కనపడుతవి—జర్మన్, పోర్చుగీస్.

ప్రేమ, కాంతి దాగవు.

ప్రేమ, అధికారము పోటీని ఇష్టపడవు—ఫ్రెంచి, ఇటాలియన్, పోర్చుగీస్.

ప్రేమను దరిద్రాన్ని దాచడం కష్టము.

ప్రేమ, గర్వము ఉన్మాదముతో చేరివుంటాయి.

ప్రేమ మతము, మిత్రత్వానికంటె బలమైనది—బెంజామిన్.

ప్రేమ ప్రేమను పుట్టిస్తుంది—లాబ్రూయెరి.

ప్రేమ విశ్వాసాన్ని కోరుతుంది; విశ్వాసం దృఢత్వాన్ని కోరుతుంది.

ప్రేమ ప్రేమను, విశ్వాసం విశ్వాసాన్ని కలిగించును.

ప్రేమ యింట్లో ప్రారంభిస్తుంది—జర్మన్.

ప్రేమలో ఈర్ష్యవుంటుంది; కాబట్టే మంచి కన్నుకూడా మెల్లగా కనపడుతుంది.

ఒకదాన్ని ప్రేమిస్తే దాని అవగుణాలనికూడా ప్రేమింపవలసిందే—ఫ్రెంచి.

ప్రేమ యేచోటునైనా మధురమయంగా చేస్తుంది—అరేబియన్.

ప్రేమను కొనడానికి అమ్మడానికి వీల్లేదు; దాని వెల ప్రేమే.

ప్రేమ కిటికీగుండా వస్తుంది, వాకిలిద్వారా వెళ్లుతుంది.

ప్రేమ అన్నింటినీ జయిస్తుంది; మనముకూడా ప్రేమకు లొంగిపోదాము—వర్జిల్.

ఉత్తమ స్త్రీలనైనా ప్రేమ మోసగిస్తుంది—హోమర్.

పొగడితంటే ప్రేమకు ఇష్టం.

ప్రేమ బంగారును కాలదన్నుతుంది.

ప్రేమ చాలా కార్యాలు చేస్తుంది; కాని డబ్బు అంతకంటె ఎక్కువ చేస్తుంది.

ప్రేమ అద్భుతాలను చేస్తుంది; డబ్బు పెళ్లిని చేస్తుంది—ఫ్రెంచి.

ప్రేమ ఈర్ష్యను తొలగిస్తుంది—ఫ్రెంచి.

ప్రేమ ఏ అపాయానికీ భయపడదు—జర్మన్.

ప్రేమ, ప్రతిఫలంగా ఈర్ష్యను అవిశ్వాసాన్ని యిస్తుంది—ఇటాలియన్.

ప్రేమ అభ్యంతరాలతోటే అభివృద్ధి అవుతుంది—జర్మన్.

ప్రేమ కట్టుబడే చట్టమే లేదు—పోర్చుగీస్.

ప్రేమ బుద్ధికి చురుకుదనాన్ని కలిగిస్తుంది; కోపం కవిత్వాన్ని యిస్తుంది—జువెనల్.

రహస్యంగా నీ దోషాలు నీకు చెప్పే వ్యక్తిని ప్రేమించు—హీబ్రూ.

ప్రేమ సమానత్వాన్ని నెలకొల్పుతుంది—ఆరన్ హిల్.

ప్రేమ మధురమైన నిరంకుశాధికారి అనవచ్చు. ఎందుకంటే ప్రేమించినవారు దాని బాధలను సంతోషంగా భరిస్తారు—నిఫాస్.

ప్రేమ ఆతురతతో చేరిన భయాలతో నిండివుంటుంది—ఓవిడ్.

తన తప్పులకు ప్రేమ తానే మన్నన—ఇటలియన్.

ప్రేమకు మృత్యువు కున్నంత బలముంది. ఎంత నీరైనా ప్రేమను ఆర్పలేదు; వరదలైనా దాన్ని ముంచలేవు—బైబిలు.

అనాథగావున్నా, అధికారంతోవున్నా ప్రేమ ఒకటిగానే వుంటుంది.

యశస్సుకంటె ప్రేమ ఉత్తమం—బాయర్డ్ టెయిలర్.

ప్రేమ గుడ్డిదేకాని చాలాదూరం చూస్తుంది—ఇటాలియన్.

ప్రేమ భయము ఒకచోట పొసగవు—సిరస్.

ప్రేమ సర్వ కళానిధి—ఇటాలియన్.

ప్రేమ ఈర్ష్యలేకుండా ఎపుడూ వుండదు.

ప్రేమ అంగడిలో దొరకదు.

ప్రేమ మృత్యువువలె బలమైంది; ఈర్ష్య గోరీవలె క్రూరమైంది—బైబిలు.

ప్రేమ శీలానికి గీటురాయి.

ప్రేమ, మోసము, అవసరము, వ్యక్తులను మంచి వక్తలనుగా చేస్తాయి.

ప్రేమకు రహస్యమార్గాలు తెలుసు—జర్మన్.

ప్రేమకు ప్రేమ తెలియదు—పోర్చుగీస్.

ప్రేమకు అంతులేదు.

ప్రేమకు శ్రమ తెలియదు.

చెడిన తాళాలను బాగుచేసే కమ్మరిని చూస్తే ప్రేమ నవ్వుతుంది.

ప్రేమ పెదవులమీద వుండదు, చాలా లోతులో వుంటుంది.

ప్రేమ శ్రమను సులభం చేస్తుంది—డచ్చి.

ప్రేమ కాలాన్ని గడచేటట్టు చేస్తుంది, కాలం ప్రేమను మరుగుపరుస్తుంది—ఫ్రెంచి.

కొంచంగా ప్రేమించినా నన్ను చాలాకాలం ప్రేమించు—ఫ్రెంచి, ఇటాలియన్, డానిష్.

ప్రేమ శరీర సౌందర్యముచేత, ఆత్మ సౌందర్యము చేత ఆకర్షింప బడాలి—ఓవిడ్.

లాభముమీద ప్రేమ విజ్ఞానులనికూడా తెలివి హీనులనుగా చేస్తుంది—చైనీస్.

ప్రేమించనివారిని ప్రేమించడము, పిలువనివారికి పలకడము వృథా, వృథా—స్పానిష్.

ప్రేమ కత్తిలేకనే రాజ్య మేలుతుంది—ఇటాలియన్.

ప్రేమకు తప్పులు కనపడవు.

ప్రయత్నంమీద కలిగిన ప్రేమ మంచిదే; అప్రయంగా కలిగింది ఎంతో శ్రేష్ఠమైనది—షేక్స్పియర్.

క్రూరుని హృదయాన్నితప్ప ప్రేమ అన్నిటిని జయిస్తుంది—ఫ్రెంచి.

ప్రేమ గాడిదలకుకూడా నాట్యం నేర్పుతుంది—ఫ్రెంచి.

ప్రేమ ప్రేమను అర్థం చేసుకుంటుంది; దానికి సంభాషణతో పనిలేదు.

ప్రేమ నిష్ఫలకంటె వేయిరెట్లు వెచ్చదనాన్ని ఇస్తుంది.



శ్రీ విద్యార్థిసమాజ మహిళావిద్యాలయముల (కాకినాడ)
25 వ సంవత్సరోత్సవ సందర్భమున తీయబడిన ఛాయాపటము.



మాలపిల్లలో "సోమిదేవమ్మ" పాత్రధరించిన

లక్ష్మీకాంతం

ప్రేమ నడవలేని చోట్లకు ప్రాకి అయినా పోతుంది.

ప్రతిఫలం లేని ప్రేమ ఉత్తరము లేని ప్రశ్న లాంటిది.

ఉద్యోగానికి ప్రేమ లోబడుతుంది.

ప్రేమలోని కోపమే దాని అభివృద్ధికి కారణం.

ప్రేమ అనే మొక్కను కన్నీటినిపోసి శ్రద్ధగా పెంచాలి—డేనిష్.

మానసముయొక్క ఉన్నతమైన బలహీన గుణమే ప్రేమ—డ్రైడన్.

ప్రేమించాలని పొడాలని బలవంతం చేయడము కూడదు—జర్మన్.

పురుషుల ప్రేమ ఒక్కమారే—జర్మన్.

పురుషుని ప్రేమ అతని జీవితములో నొక భాగము మాత్రము; స్త్రీ పూర్తి జీవితమే అది—బైరన్.

ప్రేమకు తరువాతది మానము.

క్రొత్త ప్రేమ ప్రాత ప్రేమను వెడలకొడుతుంది.

ఆహార పానీయాలు లేకుండా ప్రేమ వుండదు—ఫ్రెంచి.

ఒకముల్లూ లేకుండా గులాబీ, ఒక విరోధీ లేకుండా ప్రేమ వుండవు—టర్కిష్.

సానుభూతి స్త్రీహృదయంలో ప్రేమ కలిగించడాని కెక్కువ తోడ్పడుతుంది.

ప్రేమ చాలా చక్కనిది—బీమాంట్ ఫ్లెచ్చర్.

ప్రాత ప్రేమ ఎపుడూ పైకుబుకుతూ వుంటుంది—ఫ్రెంచి.

మధ్యలో ఎన్ని విఘ్నాలు, మార్పులు గలిగినా ప్రేమ మొదట బైలుదేరిన చోటికే వస్తుంది—ఫ్రెంచి.

ప్రేమిస్తున్నవారు 'పిల్లి—పాలు' సామెతగా వుంటారు—స్పానిష్.

దృఢత్వంలేని హృదయంలో పరిపూర్ణ ప్రేమ ఎపుడుగాని వుండదు.

రాజుల అభిమానము, ఏప్రెలు నీతో స్థితి, యువతీ ప్రేమ, గులాబిఆకులు, పాచికలు ప్రతిక్షణము మారుతుంటాయి—జర్మన్.

సులోచనాలకు, నెరసిన వెండ్రుకలకు ప్రేమపు టంగడిలో గిరాకీవుండదు—జర్మన్.

వృథాఅయినా సత్యమైన ప్రేమ, బాధను అంతం చేసే మృత్యువు మధురంగావుంటయి—టెన్నిసన్.

నిజమైన ప్రేమమార్గం సుగమముగా ఎపుడుగాని వుండలేదు—షేక్సపియర్.

మెదడుకు ఉత్తేజం కలిగించేది యశస్సుమీది ప్రేమ—ఓవిడ్.

మాతాపితలమీది ప్రేమ అన్ని సుగుణాలకు మూలము.

అధికారముమీది ప్రేమ మానవునిలో అంతర్భూత మైయుండే ఒక గుణము—టాసిటస్.

క్రూరుల ప్రేమ వారి ఈర్ష్యకంటె అపాయకరమైనది.

మనలనందరిని తల్లక్రిందులగాచేసే విప్లవము ప్రేమ విప్లవమే—బల్వర్.

అతిమధురమైన సంతోషాన్ని, అతిదుర్భరమైన దుఃఖాన్ని కలిగించేది ప్రేమ—బెయిలీ.

ఈర్ష్యవలనకంటె ప్రేమవలననే ప్రపంచములో చాలా అపాయాలు జరుగుతున్నై—స్పెక్టేటర్.

పెళ్లంటే ఏమో వివరించిచెప్పే విషయాలు కలు న్నాయి; ప్రేమంటే ఏమోచెప్పే దొకటీలేదు—పంచ్.

వేదాంతవిజ్ఞానమంతటిలోకంటె ఎంత తెలివి తక్కువదైనా ప్రేమలో ఎన్నోరెట్లు సత్సంతోషము, సౌఖ్యము వున్నయి—ఫీల్డింగ్.

తన ప్రేమను ఇతరులకు తెలుపువారు స్వల్పంగా ప్రేమింపగలుగుతారు—షేక్సపియరు.

ఎవరు గణింపబడరో వారే యెక్కువగా ప్రేమిస్తారు.

ప్రేమకోసరము పడుకున్నా ఆకలికోసరం లేవవలసివస్తుంది.

ప్రేమానుభవం లేకుండేదానికంటె అనుభవించి కష్టపడడమే మంచిది—టెన్నిసన్.

ప్రేమింపబడాలంటే ప్రేమింపబడేటట్టుగా వుండాలి.

జ్ఞానిగావుండి ప్రేమించడము మానవుని కతీతము; అది దేవతలకే సరి—షేక్స్పియరు.

గౌరవం కావాలంటే వారికి లాభం కలిగించాలి; ప్రేమ కావాలంటే వారిని సంతోషపెట్టాలి—డాక్టరు జాన్సన్.

నిజమైన ప్రేమ ఎవరికీ భయపడదు.

ప్రేమించింది నశించిన తరువాతగాని దాన్ని ఎంతగా ప్రేమించామో తెలియదు

ప్రేమ లోపిస్తే ఆ జీవితమెందుకు?—బర్న్స్.

అన్నీ విఫలమైతే ప్రేమ రక్షిస్తుంది—అనాక్రీన్.

ప్రేమ విఫలమైతే దోషాలన్నీ బైటపెట్టుతారు.

అపనమ్మిక ప్రవేశిస్తే ప్రేమ బైటికి బైలుదేరుతుంది—డేనిష్.

దారిద్ర్యము వాకిటకురాగానే ప్రేమ కిటికీ మూలంగా పరుగెడుతుంది—జర్మన్.

గర్వం ప్రారంభమైతే ప్రేమ విరమిస్తుంది.

గాఢమైన ప్రేమ వున్నచోట దారుణమైన బాధ వుంటుంది—ఇటాలియన్.

ప్రేమ లేనిచోట తప్పులన్నీ కనపడుతుంటాయి—జర్మన్.

సమానత్వం లేనిచోట పరిపూర్ణమైన ప్రేమ వుండదు—ఇటాలియన్.

ప్రేమించిన ప్రతివాడు మొదటి వీక్షణములో ప్రేమించినవాడే!

పిల్లలు లేనివానికి ప్రేమ తెలియదు—ఇటాలియన్.

ప్రేమించిన వ్యక్తి నమ్ముతుంది; భయపడుతుంది—ఇటాలియన్.

చెట్టును ప్రేమించినవాడు కొమ్మనూ ప్రేమిస్తున్నాడు—ఇటాలియన్.

మెరుపు, ప్రేమ ఇవి కలిగితే దుస్తులు ధ్వనిస్తాయి; హృదయం మండుకుపోతుంది—స్పానిష్.

ప్రేమించడాని కేమీ మిగలకపోతే భయపడడాని కేమీ మిగలదు—బైరన్.

ప్రేమనిరూపణాలు పదాలు కావు; పనులు—స్పానిష్.

## 3

కమలకు:—

మొన్న వాళ్ళ శ్యాం విద్యాభ్యాస సందర్భంలో హేమ వచ్చిం దిక్కడకు. అబ్బ! ఆ అమ్మాయి ఎంత అమాయకురాలనుకున్నావ్! తన కొడుకును ఏజిల్లా కలెక్టరుగానో, ఏ సూపరింటెండెంటుగానో చూడాలని అభిలాష. ఎంత చెప్పినా, ఆంగ్లభాష మీదగాని, ఆంగ్ల సాంప్రదాయం మీదగాని, ఆంగ్ల విద్యమీదగాని అభిమానం అంతరించిపోవడం లేదామెలో. ఆవిడ తప్పేముంది? పాపం, అజ్ఞానాంధకారంలో కూలి, కుమిలి, కృశించి, నశించే ఆమె మేధస్సు వజ్రపు తునకల్లా ధగధగా మెరసిపోయే ఈ ప్రభుత్వపు ఉద్యోగాల్ని కాక మరేం కాంచ గలుగుతుంది? దయ, దాక్షిణ్యం, హృదయంలేని జమీందారింట్లో, నిర్జీవంగా, దేశానికి నిరుపయోగంగా, పెట్టెల్లో, దాస్యంలో కులుకుతూ ఉండే ఈ వజ్రపు తునకలు లెక్కకు నాలుగే ఉంటాయని ఆవిడ గ్రహించగలుగుతూ ఉందా? మానవుడు తలదాచుకోవడానికి ఒక ఇంటి రూపంలోనో, ఏకాంతాన భగవంతునికి ప్రేమాంజలి సమర్పించడానికి ఒక దేవాలయ రూపంలోనో, వెలసి వెలుగొందడానికి ఉబలాటపడే చిన్న చిన్న మంటిగెడ్డలు కోటానుకోట్లున్నాయని ఆవిడ గుర్తించలేదు. మన పంట భూములన్నీ ఉపయోగించుకొనే నాథుడులేక వట్టి పట్టెల్లక్రింద తయారవుతున్నాయి! ఇది తెలియదామెకు. ఎంత చెప్పినా చేసే తప్పును గుర్తించదు; ఆ ఉద్యోగం, ఆ హోదా, ఆ గౌరవం ఆ ఠీవి అంటుంది.

పైగా, ఈఇంగ్లీషు చదువుకోసరం ఆంగ్ల పాఠశాలకు పంపుతానంటుంది వాళ్ల అబ్బాయిని. ఎంత తెలివైన వాడనుకున్నావ్, ఆ అబ్బాయి! అతని తెలివితేటలన్నీ బూడిదపోసిన పన్నీరుగా నిరుపయోగం అయిపోతాయేమోనని నాకు విచారం. ఐనా, నీవాలోచించు ఏముంది యీ ఇంగ్లీషు చదువులో? విద్య మానవుడికీ, దేశానికీ ప్రపంచానికీ సహాయకారిగా ఉండాలి. మనస్సుకు, దృష్టిపథానికి, సరియైన శిక్షణ గరపడంలోనే విద్యయొక్క గొప్పతనము బహిర్గతమౌతూ ఉంటుంది. వ్యక్తి తనవ్యక్తిత్వాన్ని సమష్టిలో గోల్పోవడమే భారతీయ విద్యాదర్శము. ఆంగ్లవిద్యకు ఆదర్శం ఏమిటో ఊహించుకోగలవా? వాళ్ల సాంప్రదాయాలకు మన సాంప్రదాయాలకు నడుమ, కంచుగోడల్లాగు, తీవ్రమైన భేదాలున్నాయి. గుర్తించరు మనవాళ్లు. భగవంతునికి నీరాజనాన్ని నివేదించడంలో ఉత్కృష్టమైన భావముందని, కాంతిమయుడైన పరమాత్మకు నీరాజన రూపంగా తన ఆత్మనే కానుకగా సమర్పించుకుంటున్నాడని, మన గృహంలో, మన ఉపనిషన్మధువుల సహాయాన నేర్చుకుంటున్నాం; మనం మన పాఠ

శాలకు వెళ్లేటప్పటికి, ఇవన్నీ అనాగరిక జాతుల బహిర్గత విచేష్టితాలు, నిరర్థకాలు అనే బోధకు గురి అవుతున్నాం. ఎందువల్లో ఇది తెలుసా? మనకూ పాశ్చాత్యులకూ దృష్టిపథాలలో అంతులేని విభేదాలున్నాయి. భౌతిక శాస్త్రాలే ప్రమాణాలుగా అంగీకరించే వారికి మన వేద వేదాంగాల గూఢార్థాలు స్ఫురింపవు. పెరిగే పరిస్థితులకు, నేర్చుకునే విద్యకు సామరశ్యము లేకుండా బ్రతికే మనకు మన సంఘం అంటే అభిమానం, గౌరవం ఎలా ఉంటాయి? మన ఆచార వ్యవహారాలు, మన విజ్ఞానాలు, మన మతాలు అంటే ఒక విధమైన అసహ్యమూ, అయిష్టమూ అకారణంగానే మనలో జనిస్తూ ఉన్నాయి. మనమూ ఒక మనుష్యులమేనా దృష్టిపథాలు విధ్వంసం చేసేసుకున్న తర్వాత? ఇదేనా విద్యవల్ల రావలసిన మానసిక శిక్షణ? తెలివి తేటలు గల మర్కటాలుగా తయారవుతున్నారు మన బాలబాలికలు! హేమకు ఈ మాటలు రుచిస్తాయా కళ్లను చెదరగొట్టే ఉద్యోగాల కాంతిలో మునిగి తేలుతూఉంటే?

ఎందుకొచ్చిన ఈ ఆంగ్లభాష మన శిరస్సులమీద? మోయలేక కృంగి పోతున్నాం. రెండుమూడు మాటలను కలిపి నూతన సమాసాలను సృష్టించుకోవాలంటే, మన జాతీయ సాంప్రదాయాలను వెల్లడి పరచుకోవాలంటే మన మాతృభాషల్లో ఉండే అనువూ వీలూ ఈ దురదృష్టపు ఆంగ్ల భాషలో ఉందా? భాషాతర్క శాస్త్రాలకు అనువైన సంబంధం ఉందని గోల పెట్టి లాటిన్ తర్కశాస్త్రాని కెదురుగా ఆంగ్లంలో తర్కశాస్త్రాన్ని తయారుచేసికొన్న ఆంగ్లేయులకు ఇంకొక దేశంలో వాళ్ల ఆంగ్ల భాష మూలాన ఆ దేశీయుల తర్కశాస్త్రాన్ని దూరం చేసెయ్యడానికి మనస్సు ఎలా ఒప్పిందో? దేశీయ తర్కశాస్త్రానికి దూరంగాఉన్న వాళ్లకు జీవితంలో సామరశ్యమెలా సిద్ధిస్తుంది? అందువల్ల మన బాలబాలికల సుస్వభావాలు ఎలా వక్రిస్తున్నాయో ఆలోచించుకో గలవా?

పోనీ, హేమ అనుకునేటట్లు, ఈ ఉద్యోగాలైనా ఎంతమంది చదువుకున్నవాళ్లకున్నాయని నీ ఉద్దేశ్యం? నూటికి ఏ ఒక్కడికో ఉంటే అక్కడికొక వింతైన విషయమే. అదీ కాకుండా, వ్యవసాయదారు కుమారుడికి వ్యవసాయమంటేగాని, కలంకారీ వ్యాపారస్థుని వారసుడికి కలంకారీ అంటేగాని ఏమైనా తెలుస్తూ ఉంది అని అనుకుంటున్నావా? ఏమీ లేదు. ఇక చేతిపనుల విషయం చెప్ప నక్కరనేలేదు. పైగా, పొట్ట చుట్టూ గిరగిరా తిరుగుతాయే సర్వ ప్రపంచాలన్నీ, పొట్టలైనా తృప్తిపరచలేని ఈ చదువు ఎందుకు ఇంకా? ఏమిటి వీళ్లంతా వెఱ్ఱిగా ఎగబడడం? అందుకనే గాంధీగారు ఒక చేతిపని ద్వారా విద్యగరపాలని (Wardha Scheme) ప్రయత్నాలు చేస్తున్నారు. గాంధీగారి మార్గం కావలసిన అవసరాలన్నిటినీ తీర్చినా తీర్చకపోయినా, విద్య ఒకచేతిపనిద్వారా, తెలిసిన దాన్నుంచి

తెలియని ఇంకో విషయానికి, వ్యక్తినుంచి సమష్టికి, వెళ్లడం చాలా శ్రేయస్కరమైన మార్గంగా ప్రపంచమంతా అంగీకరించారు.

కాని అధః పాతాళాలలో, వైతరణీనది లోతులుచూచే నేటి భారతీయ జాతికి ఈ విద్య చాలా? చేతిపనులేకాదు కావలసింది భారతీయ సాంప్రదాయానుకూలంగా, భారతదేశపు ప్రస్తుతావసరాల ననుసరించి, ముందు జరుగబోయే ప్రపంచనాటకంలో భారతదేశం ఆడబోయే పాత్రానుగుణ్యంగా, మన జాతీయవిద్య తయారవవలసి ఉంది. మన బాల బాలికలకు తమ మాతృభూమిని ప్రేమించడం, ఆ ప్రేమలో ఆనందాన్ని, అనుభవించడం గర్వపడడం ముందు నేర్పవలసిన అవసరముంది. ఇది కళలసహాయాన ప్రవేశపెట్టవలసిన మార్పు; అందులోనూ ఎక్కువగా సంగీత నాట్య నృత్య కళలమీద ఆధారపడి ఉంటుంది. తరువాత చిన్నచిన్న కథలవల్ల మన జాతీయ సాంప్రదాయాలంటే, మన జాతీయ వీరులంటే మన బాల బాలికలు ఉద్రేకపూరితులై పోవాలి. ఇలాంటి ఉద్రేకాలకుగాని, హృదయ శిక్షణకుగాని, వార్థా విద్యలో తగిన స్థానంలేదు. కళా జ్ఞానము ఇప్పు డున్నట్టుగా కాకుండా మన విద్యలో ఒక ముఖ్యమైన భాగంగా జాతీయుడైన ప్రతివాని అందుబాటులో ఉండాలి. ఇప్పుడిటలీలో అనుకరించే పద్ధతి ఇదే! విద్యార్థికి ప్రప్రథమంలో నేర్పుకునే విషయాలయందు గౌరవం, తాను స్వీకరించబోయే విమాత్నభావాలయందు ఒకవిధమైన అభిమానం పెంపొందింపచేస్తే ఆతరువాత సాంఘికధర్మాలు, సాంప్రదాయాలు, దేశస్థితి అందచేస్తే మేధస్సు అందుకోగలుగుతుంది. విద్యావిషయంలో మేధస్సును అభివృద్ధిపరచడం ఎంతముఖ్యమో, సహృదయత్వాన్ని శేకత్తించడంకూడా అంతేఅవసరం. మనము బాలబాలికల్ని పరిపూర్ణ స్వరూపులు, స్వేచ్ఛాజీవులు హృదయపూరితులు మేధస్సమేతులుగానే పరిగణిస్తున్నామంటావా?

ఇంతకూ నే చెప్పేది ఏమిటంటే ఈ చదువులకు పంపి వాళ్ల ప్రకృతిని నాశనం చెయ్యడంకంటే, ఏ వడ్రంగమో నేర్పి జాతీయ స్వరూపుడ్నిగా చేయమని. ఏం, మనపిల్లలకు కావలసిన వాతావరణాన్ని మాతలైన మనం తయారు చెయ్యలేం? అలా చెయ్యలేక పోయినట్లయితే ఇంకా మన మాతృత్వం ఎందుకు? ఇతర ప్రభుత్వపు తాకిడికి బాధపడుతూ, దెబ్బలు తింటూ, మన సంతానాన్ని మన జాతిగా, మన దాస్యశృంఖలాలు త్రెంపివేసే వీర మూర్తులుగా, తయారు చేసికోలేం? ఉద్యోగాల పేరుతో, సంఘానికీ, దేశానికీ, మన ఆత్మకూ ద్రోహం చేసేస్తామా?

ఎన్ని చెప్పినా హేమ ఇంగ్లీషు చదువంటుంది!! మళ్లీ ఇంకోమారు చెప్పి చూస్తాను. నీవుకూడా వ్రాయి.

ఎపుడూ నీ విషయమే తలచుకొనే,

'వాణి'.

# బాధ్యులెవరు?

శ్రీమతి వెలిదండ చూడికుడుతమ్మగారు

ఇదివరకు

వసంతారామారావులు కొరతలేని సౌఖ్యజీవనం గడుపుతూవున్నారు. వారికి రఘు, కేశవుడు, కృష్ణమ్మ అని ముగ్గురు కుమారులు. కృష్ణమ్మమీద తల్లిదండ్రులకు అమిత ప్రేమ. అతనంటే తల్లికి మరింత ముద్దు. అతని ఆరోగ్యం చూడకుండా వసంత మురిపెంగా పెంచేది. ఒకరోజు తండ్రితో గూడా కృష్ణమ్మ షికారువెళ్లి వానకుతడిసి కఫజ్వరం వచ్చి మరణించాడు. అతనిమృతికి భర్తేకారకుడనివసంత అతన్ని అనరానిమాటలనికఠినంగా అతనితో తనకేలాంటి సంబంధం వద్దంది. రామారావు నోరుమెదపకుండా భార్య ప్రవర్తనకు లోలోననే కుమిలిపోయాడు. కృశించాడు. అయినా వసంత హృదయంమారలేదు. ఏడేండ్లిలా గడిచాయి. ఇద్దరుపిల్లలు చదువులుఉద్యోగాలు చూచుకుంటున్నారు. రామారావు ఎక్కడకో వెళ్లిపోయి రెండురోజులైంది. వసంతవంటరిగా తనభర్తతో ఘార్వ్యజీవితం జ్ఞాపకంతెచ్చుకుంటూ ఆందోళనపడుతూవుంది. ఇంతలో భర్త వుత్తరంవచ్చింది.

ఇక చదవండి

"నేను నా హృదయమును నీకు విప్పి చూపించి నీకు విచారం కలిగించుకోదలచుకోలేదు. నీకు నేను చేసిన ద్రోహము క్షమింపరానిదే. కాని అది నా హృదయపూర్వకం కాదని నీకు బాగాతెలుసు. ఆ సంగతిని గ్రహించగల నీవు నీహృదయాన్ని ఎప్పటికైనా మార్చుకొని నీ సహజసరళత్వాన్ని నామీద పూర్వమువలెనే చూపించుతావని ఆశతో, నమ్మకంతో రోజులు వారములు నెలలు చివరకు సంవత్సరాలు గడిపాను. నాకెక్కడా ఆశఅన్నది ఒక్కనాడైన కనబర్చావుకావు. అందుకు నిన్ను నిందించను. అది విధి. ఇక నాకీ ప్రపంచంలో ఏమీలేదని నమ్మకం కుదిరిపోయింది. వసంతా! నేను ఆత్మహత్య చేసుకునేందుకు అనేకసార్లు ప్రయత్నించానని చెప్పినప్పుడు నీవు నమ్మకపోవచ్చును. కాని నావిధి నేను ప్రపంచంలో తీర్చుకోవలసిన ఋణము నాకు అడ్డుతగులుతూ వచ్చింది. పిల్లలు పెద్దవారైనారు. వాళ్లంతట వాళ్లు ప్రపంచంలో సంతోషంగా కాలంగడుపుకోటానికి స్థానాలు ఏర్పడ్డాయి. యీ ఎడబాటుకు వారినిఏడువవద్దని చెప్పుము. నీ కొరకు నీ భవిష్యజ్జీవితముకొరకు కొంతసొమ్ము నీపేర బ్యాంకిలో నిల్వజేశాను. దానితో నీవు సుఖముగా కాలక్షేపంచేయుము. ఈ ధనార్జనకోసరమే ఇప్పటివరకూ ఊపిరి బిగబట్టుకొని పని చేశాను. నీవునన్ను నీహృదయంనుండి సమూలంగా దూరంచేసివేశావనే నా నమ్మకము. నాకు నీ హృదయంలో సూది మొనపాటి స్థానమైనాలేదని నాకు తెలుసును. కాని నా హృదయంలో నీ ప్రేమమూర్తిని శతసహస్రవిధాల ఆమరణాంతం ఆరాధిస్తూనేఉంటాను. నాఃఖునివాయువు నాశరీరంలో పోయేవరకు అట్టి సంతృప్తితోనే ఉంటాను. ఇకనైనా నీకు సత్యము గోచరించేలాగు భగవానుడాశీర్వదించుగాక. నీకు ఆయురారోగ్య ఆనందములను చేకూర్చుగాక. వసంతా సెలవు."

7 సంవత్సరములుగ మూతబడిన జ్ఞానకవాటం తెరవబడింది. దీనితో నాలోనున్న దురభిమాన దురహంకార విషవాయువులు అంతరించినాయి. నాతల వేయి గొడ్డళ్లతో బాదినంత బాధ అనుభవిస్తున్నది. ఆజాబులోని ప్రతి ఒకఅక్షరంలోను

అక్షరంలో ఉన్న ప్రతి ఒక గీతలోను, ఆయన హృదయంలో ప్రవహిస్తూఉన్న నిష్కళంకప్రేమ ఆవేదన తొలకరిస్తున్నాయి. నన్నుగూర్చి నా అన్యాయనిందారోపణనుగూర్చి ఒక్క అక్షరమైన వ్రాయలేదు. అలాగు చేసినా కొంత నాకు చిత్తశాంతిగా ఉండేది. ఎన్నో సంవత్సరములు ఎక్కువ సహనముతో నా అన్యాయాఘాతములను సహించి సహించి అలసిపోయినారు. అన్ని రోజులలో ఒక్కనాడైన పొరబాటునగూడా ఒక్క ప్రతినింద పోనీ తన నిర్దోషత్వాన్ని నిరూపించే ఒక్కమాట మాటాడలేదు. ఆ జాబును గుండెలకత్తుకున్నాను. కళ్లకద్దుకున్నాను. వెయ్యి తేళ్లు శరీరమంతా పాకుతున్నట్టు అలుకులాడిపోయినాను. నన్ని అగాధ పాపాంధకారకూపంలోనుండి ఉద్ధరించేదాత ఎక్కడైనాఉన్నాడా అని నిట్టూర్పువుచ్చాను. అకస్మాత్తుగా గదితలుపు తెరచిన ధ్వని అయింది. మూసినకన్ను తెరచాను. ఒక ఆజానుబాహు విగ్రహము నా ఎదురుగుండావచ్చి నిలబడ్డది. అతడు నాకు పరాయివాడుగాడు. నా భర్తగారి బహిఃప్రాణము. అంతరంగిక స్నేహితుడు, కంపెనీ భాగస్వామి విశ్వేశ్వరరావుగారు. నేను మునుపు ఆయనను ఎప్పుడుచూచినా మిక్కిలి గౌరవంగాను ఆదరంగాను కనబడేవారు. ఇప్పుడో ఆదృష్టిలో తీక్ష్ణత, జుగుప్స, ఆతుర్దా, నేరనిరూపణ దీక్ష స్పష్టంగా ప్రతిఫలిస్తున్నాయి. ఆయనను కూర్చోమనటానికి గాని నేను నిలబడటానికి గాని నాకు ధైర్యం చాలలేదు. రావడమే తడవుగా కొంచము దృఢస్వరంతో "వసంతా! నేనిప్పుడు వచ్చినదెందుకో నీకు తెలుసునా? నీవు చేసిన ఘోరాతిఘోరమైన పనినిగూర్చి తెల్పుటకు వచ్చినాను. అది సామాన్యమైనదని నీమనస్సులో తలుస్తున్నావు కాబోలు. అది నీ స్వరూపనాశనమైన పని అని నీవు కనుక్కొనలేకపోయావు. నీవు కోటి జన్మములెత్తినా అటువంటి ఉత్తమోత్తమపురుషుని సంపాదించలేవని ఖండితంగా చెపుతున్నాను. నా ప్రాణస్నేహితుని క్షీణదశకు కుమారుని మృత్యువే అని కొన్నాళ్లవరకు అనుకున్నాను. దినదినమునకు అతనిలో కన్పించే హృదయవిదారకమైన క్షీణత నాకు చాల ఆతుర్దా కల్గించినది. ఇందులో ఏదో ఒకరహస్యమిమిడియుండవలెనని నాకు గొప్ప అనుమానంపట్టుకుంది. అనేకసార్లు రహస్యంగాపిలిచి అడిగాను. హెచ్చరించాను. బంధువును ప్రాణస్నేహితుడను నాతో చెప్పిన తప్పులేదు అని బ్రతిమాలేను. కన్నీరు కార్చేను. విసుగుకున్నాను. ఏమీ లాభములేకపోయింది. ఎన్నిప్రశ్నలడిగినా అన్నిటికీ ఒక్కటేనవ్వు. అది దుస్సహబాధాసూచకము. బలవంతము. హృదయవేదనావమనప్రయత్నము. నేనడగటానికి విసుగుకొనలేదు. సంగతికనిపెడదామనే ప్రయత్నము ఆలోచన మానలేదు. కాని వృథాప్రయత్నుడనైనాను. మొన్న రెండురోజులక్రిందట డబ్బుకు సంబంధించిన జమాఖర్చులెక్కలు యావత్తు అరటిపండుఒలిచి చేతికిచ్చినట్టు పూర్తిగా వప్పచెప్పినాడు. నేను ఆశ్చర్యపడ్డాను. భయపడ్డాను. భుజముమీద చేయివేసి ఆతుర్దాగా 'ఎక్కడికిప్రయాణము' అన్నాను. అప్పుడు బయలుపడ్డాడు. తన అంతరంగంలో కార్చిచ్చులాగ తన్ను కాల్చివేస్తున్న సంగతినిగురించి అంతా పూసగ్రుచ్చినట్టుచెప్పి కన్నీరుకార్చకుండా ఉండలేకపోయాడు. అతనిలో ఎంత సహనశక్తిఉన్నదో కాని ఆసమయంలోకూడా నిన్ను ఒక్క పల్లెత్తుమాట అనలేదు. మీకుమిక్కిలి ఈ సంగతులనుగురించి నిన్ను ఒక్కపీసరంతైన కదపకూడదని నాచేత ప్రమాణం తీసుకున్నాడు. భార్యాభర్తలమధ్య ఉండేతగాదాలలో ఎవరూ జోక్యం కల్గించుకోకూడదు. 'ఆలిమగల కయ్యము అద్దముమీద పెసరగింజలాంటి'దని పెద్దల వచనం. మీవిషయంలో అది అబద్ధంఅయింది. అతడు నాకీసంగతులుచెప్పి రెండురోజులైంది. నాచేత అతడు తీసుకొన్న ప్రమాణంవల్ల ఈ రెండురోజులు రెండు యుగాల్లాగ నేను వృథా ఆలోచనతో కాలం

గడపవలసివచ్చింది. కాని నాస్నేహితుని పరిస్థితులను బట్టి నాప్రమాణం నాకు చిల్లిగవపాటి విలువగానైన కనబడలేదు. అతడు నాప్రాణము. కొద్దికోజుల క్రిందటనైనా అతడు నాలో చూచాయగా చెప్పితే కొంత బాగుపరుచుటకు ప్రయత్నించే వాడిని. ఇప్పు డేమనుకుంటె ఏమి లాభము. నీలాంటివాడే అతడూ అయితే నీ కార్పణ్యం నీహింస అతడ్ని బాధించేవి గాదు. అతడు దయార్ద్రహృదయుడు. నిష్కళంకుడు. నిరాడంబికుడు. మిత భాషి. అటువంటి వానిని యుక్తాయుక్తజ్ఞానం లేకుండా నిష్కారణంగా ఇష్టం వచ్చినట్టు హింసించి వేశావు. ఈవిశాల భూప్రపంచంలో ఒక మనిషి యొక్క మరణానికి ఇంకొక మనిషి ఎప్పుడూ కారకుడు కాడనే సంగతి నీకు తెలియనట్టుంది. సమస్తమును సృష్టించి లయింపజేసే అధికారము ఒక్కని చేతిలోనే యున్నది. వాడే భగవంతుడు. సమస్తకర్మలకు నియంత. సంకల్పమాత్రుడు. ఏవోకొన్ని బలవంతపు ధూర్తక్రియలకు శిక్షలు ఈ ప్రపంచములోని శిక్షాస్మృతులు విధించుచున్నవి కాని, ప్రతిసిద్ధంగా జరిగే కార్య కలాపములకు కారణము ఇంకొక వ్యక్తికి ఆరోపించటం ఘోరమైన సాహసము. పరమేశ్వరుని యెడల గొప్ప అపచారము చేసిట్టవును. ఇటువంటి సందర్భంలో ఉదాహరుడైన నీభర్తను అటువంటి కఠిన శిక్షలకు నీవు గురిచేయటం ఎంతమాత్రము క్షమింపదగ్గదికాదని నీవిప్పటికైనా గ్రహించవలెను. అట్టి అధికారము నీకుగాని, నాకుగాని ఈప్రపంచంలో ఏ జీవికిగాని లేదు, బహుశా వాదనకు మానవులు కొంతవరకు బాధ్యులవుతారని ఒప్పు కుందాము. ఆలా గనుకున్నప్పటికి ఆ తప్పు అతనిదిగాదు. అది నీది. ఆ సంగతిని ఘంటాపథంగా నేను నొక్కి చెపుతున్నాను. నీవు అతి గారాబంచేసి ఆ కుఱ్ఱవానికి తగిన శరీరపోషణ ఇచ్చావుకావు. తక్కిన పిల్లలతో ఉత్సాహంగా తిరిగి ఆడుకొనిస్తే శరీర పరిశ్రమ, పిల్లలకుండే ఉద్రేకము మొదలైనవి పట్టుబడేవి. ఎంత బుద్ధి వికాశం ఉన్నప్పటికీ, శరీర వికాశం లేకపోయింది. కుమారుని ఆరోగ్యముకూడా గమనించ వలసియున్నదని అతడు గ్రహించాడు. నీవే పడనిచ్చే దానవుకావు. అంత సుకుమారంగా పెరిగిన శరీరము జబ్బులను ఎదుర్కొనటానికి తగిన శక్తిని కలిగి ఉండదు. ఆసంగతిని ఆ పిల్లవానియందు నీకుండే మమకారము నీకు తెలియనివ్వింది కాదు. అందువల్లనే ఒకసారి వర్షములో తడియగానే జబ్బు చేసింది. ఇది కేవలం బయటకి తీసుకొనివెళ్లటంబట్టే రాలేదు. ఇంట్లో ఉన్నప్పటికి ఆ జబ్బు వచ్చి తీరవలసిందే. ఎందుకంటె ఆచుట్టుపట్ల ఉండేచలిగాలే చాలును వాడి ప్రాణానికి.

వసంతా! ఇప్పుడు నే నాడినమాటలు నీతో ఆడవలసినవా ఆడకూడనివా అని ఆలోచించి మాటాడలేదు. నాప్రయత్న మెంతమాత్రము లేకుండానే నా స్నేహితునికి నాకు ఉండే అవినాభావసంబంధమే ఏమేమో పలికించింది. వాటిని నేను తిరిగీ చెప్పలేను. సత్యమును నీ దృష్టిపథంలో పెట్టడమే నా ముఖ్యోద్దేశము.

ఆమాటలు విన్నాను. నా భర్తగారి జాబుతో విడుతూ విడుతూ ఉన్న నా జ్ఞాననేత్రం పూర్తిగా విడిబడింది. ఇటువంటి ఘోరస్థితికి మూల కారణమైన నేను ఇక భూమిమీద నిలవటం దుస్తరం అని అనిపించింది. కాని ప్రాణత్యాగం చేసుకోటానికి నాకెంతమాత్రమూ హక్కు లేదు. నేను చేసిన అమానుష కార్యానికి ప్రాయశ్చిత్తం అనుభవించాలి. నా పరితాపము, నా పశ్చాత్తాపము, పరమపూజ్యుడైన నా భర్తకు తెలుపుకోవాలి. ముందు వెనుకలగపడలేదు. కర్తవ్యం తోచలేదు. ఎదురుగా నిల్వబడి జ్ఞానోదయం కల్గించినవిశ్వేశ్వర రావే నా పాలిటి విశ్వేశ్వరుడనుకున్నాను. కాళ్లమీదపడి నా కన్నీటిచేత ఆ పాదములను కడిగివేశాను. రెండుచేతులు పట్టుకుని

"తండ్రీ! మీరే నాకు రక్షకులు. నేను ఘోరపాపిని. హంతకురాలను. స్త్రీజాతికి తీరని కళంకాన్ని కల్గించిన క్రూరురాలిని. నా జీవిత సర్వస్వమును నా చేతులార హింసించి హింసించి కొత్తికి కొత్తికి కడుపులో పెట్టుకున్నాను. నాదురహంకారానికి ఆ పవిత్ర పురుషుని ఆహుతి చేసివేశాను. నాకేదైనా తోవ చూపించరా. ఆయన ఎక్కడవున్నారో మీకు తెలిసిన నాకుచెప్పి పుణ్యము కట్టుకోండి. నేను పొట్టతో నైనప్రాకి ఆ స్థలముకువెళ్లి కాళ్లుపట్టుకొని క్షమార్పణ వేడుకుంటాను. ఆ సుకృతునకు ఈ విశాల భూప్రపంచంలో ఏమూలనైనా మూరెడు స్థలము భగవంతు డుంచాడని వింటే చాలును. అట్టి అమృత వాక్కు నా ఈ పాపపు చెవులు విననోచుకొనునా? నన్నెక్కడికి వెళ్లమంటే అక్కడికి వెళుతాను. ఎంత ప్రయాసకరమైన మార్గమైనా సరే, నేను ఊరికి పరిగెత్తి నా ప్రాణధనాన్ని తెచ్చుకుంటాను. ఆర్యా! దయచేసి చెప్పండి. ఎక్కడ ఉన్నారో. నేనేమి చెయ్యాలో. అధఃపతన పాతాళలోకంలో కృంగిపోయాను. నన్ను ఉద్ధరించటానికి ఆ భగవంతుడే మీ స్వరూపంగా ప్రత్యక్షమైనాడు" అని వెక్కి వెక్కి ఏడ్చాను. వెఱ్ఱిదాన్నై పోయాను. నే పెట్టిన బాధలన్నీ అనుభవించిన నా రామారావు రామచంద్రునివంటి ధీర హృదయంతో వెఱ్ఱెత్తిపోకుండా నిల్వబడ గలిగారు. నే నిప్పుడు వెఱ్ఱిదాన నైపోయాను.

* * *

విశ్వేశ్వరరావు నేనూ ఊళ్లోపడ్డాము. నాభర్త తిరిగే ప్రతి గృహము, ప్రతి ఊరు, ప్రతి సత్రము గాలించాము. పోలీసులకు రిపోర్టు చేశాము. పేపర్లలో ప్రకటించాము. ఆశ అన్నది ఎక్కడా కల్గలేదు. ఈ ఆరాటంతో నే కొన్నిరోజులు గడిచిపోయినాయి. ఆ చూకైనా తెలియలేదు.

కేశవుడు తన డిగ్రీని పుచ్చుకోటానికి కాన్వొకేషన్ హాలుకు వెళ్లిపోతున్నాడు. పిల్లల తల్లి తండ్రులు అత్యుత్సాహంగా హాల్లోకిచేరారు. నేనూ వెళ్లాను. మాది కూపటానికైనా చోటులేకుండా హాలు క్రిక్కిరిసి పోయింది. తల్లిదండ్రుల సంతోష కోలాహలాలు నాగుండెలు బ్రద్దలు చేశాయి. తన కుమారుడు ఎప్పుడు డిగ్రీ పుచ్చుకుంటాడో అని నా భర్తగారు ఎంతో ఆతుర్ద పడేవారు. ఆయన ఉసురు పోసుకున్నాను. కేశవుడు డిగ్రీ పుచ్చుకున్నాడు. నా దగ్గరకువచ్చి నమస్కారం చేశాడు. ఆ నమస్కారం హృదయ పూర్వకంగాలేదు. మనస్సులోనా యిందుండే కంటగింపు పైకి కనబడనీయకూడదనే భావంతో పెట్టిన నమస్కారం. అందుకు నేను తప్పకుండా తగినదాననే.

పిల్లలందరూ చాల సంతోషంగా ఉన్నారు. నాకు దేనిమీదా రుచిలేకపోయింది. ఇంటికివచ్చి మేడమీదకు వెళ్లిపోయాను. కళ్లుమూసుకున్నాను. నాకు తెలియకుండానే కళ్ల వెంబడి నీళ్లు కారిపోయినాయి. నా సాధుడు తన కుమారుని విజయోత్సవం చూడలేదని. ఏంచేస్తాను. ఎవరిని వేడుకోను.

విశ్వేశ్వరరావుగారు మెల్లిగా లోనికివచ్చారు. ఆ మొగంలో వింతదైనమార్పు కనబడింది. నేను గ్రహించలేకపోయాను. నన్ను చూడంగానే మామూలు ఓదార్పుమాటలు కాకుండా చిన్ననవ్వు నవ్వారు. ఆ నవ్వులో సంతోషం తాండవిస్తూఉంది. ఆ సంతోషాన్ని పైకి కనబడనీయకుండా అణచుకుంటున్నారు. నేను ఆగలేకపోయాను. రెండుచేతులు ఎత్తి నమస్కారంచేసి "నేను యింకా ఎన్నాళ్లు ఈ ఘోర యాతన అనుభవించాలి. ఆ మహానుభావుడ్ని ఒక్కసారి, ఒక క్షణం నా కళ్లబెట్టితేచాలు. ఈ హంతకురాలివద్ద ఆ పవిత్రమూర్తిని ఉండవలసినదని కోరను. జీవములలో ఉన్నారు అన్న ముక్క వింటే చాలును. నాకీకబురు చెప్పి పుణ్యము కట్టుకోరా? మీరు చేసిన ఉపకారానికి నా ఆ జన్మాంతము మీఇంట్లో కూలిపనిచేస్తూ పశ్చాత్తాపాగ్నిలోబడి ప్రమగ్గతూ

ఉంటాను" అని పలవరించాను. రెండు చేతులూ నులుపుకున్నాను. విశ్వేశ్వరరావుగారు సాధారణ స్వరంతోనే "సరే చూపిస్తాను. నీవుమాత్రము ఉద్వృతం పొందకూడదు. ప్రశాంతంగా ఉండాలి. అది ఉభయులకూ మంచిది. ఈరోజు కాన్వొకేషన్ హాలు లోనే నా స్నేహితుడిని చూడటం తటస్థించింది. ఎవరికీ కనబడకుండా వచ్చి తన కొడుకు డిగ్రీ పుచ్చుకోవటం ఆ సమయంలో నీవువస్తే నిన్నూచూచి రెండో కంటికి కనబడకుండా వెళ్లిపోదామని ఇక్కడికి అతడు వచ్చాడు. నేనుచూచీ చూడటంతోటే అతనిపై బట్టపట్టుకుని వదలకుండా ఇక్కడికి లాక్కొని వచ్చాను. తండ్రీ కొడుకులు క్రింద ఉన్నారు. నీవు అతన్ని చూస్తావని అతను ఇప్పటికిన్నీ నేనెంత చెప్పినా నమ్మటంలేదు. నేను క్రిందకువెళ్లి ఆయన్ని తీసికొని వస్తాను" అని క్రిందికి వెళ్లెను.

నేను నామనస్సును నమ్మలేకపోయాను. కళ్ల వెంబడి అప్రయత్నంగా కారేవి దుఃఖాశ్రువులో ఆనందాశ్రువులో నాకు తెలియదు. అడుగులచప్పుడు వినబడుతూ ఉన్నకొద్ది నాగుండెలు నాస్వాధీనం తప్పిపోతూ ఉన్నవి. తలుపులోనుకొని విశ్వేశ్వరరావుగారు లోనికివచ్చారు. ఏమిచేశానో నాకు తెలియదు. కొంతసేపటికి నేనాయన వళ్లోవున్నాను. ఇద్దరి కళ్ల వెంబడి నీళ్లు కారిపోతున్నాయి. కళ్లు, కళ్లు, చేతులు, చేతులు, మొగము, మొగము, కన్నీటి ధారలచేత ఏకమై పోయినాయి. ఆ పరితాపము కేవలము దుఃఖమూలకమును గాదు. కేవలము సంతోష మూలకమును గాదు. రెండింటి సమ్మేళనము. భావిశాశ్వత సౌఖ్య సంధానము. ఆలాగు ఎంతసేపున్నామో ఎదురుగుండా ఎవరున్నారో అనేజ్ఞానం మాకు లేకపోయింది. నేను నా ద్రోహమును క్షమింపమని వేడుకుంటున్నాను. ఆయన నానోటిని బలవంతంగామూసి విధినిగడవ ఎతటివారికి అశక్యమని ఓదారుస్తూ నన్ను క్షమింపమని వేడుకున్నారు. సుకృతులస్వభావ మటువంటిదేగదా!

నేను నా ప్రేమ స్వరూపాన్ని తిరిగి పొందగలిగాను. దేశమును త్యజించి వెళ్లినతరువాత ఆయన అనుభవించిన కష్టాలువిని సహించలేక పోయాను. తన ధనమంతా నాకిచ్చివేసి కొద్దిపాటి ధనంతో మారుమూల ఊళ్లకుపోయి కాలక్షేపం చేశారు. ఆధనం కాస్త అయినతరువాత కూలిపని, రాళ్లుకొట్టటం, బిచ్చమెత్తటం మొదలగువాటితో కాలక్షేపం చేశారట. తనకొడుకు డిగ్రీ పుచ్చుకోబోయే రోజుకు ఇక్కడికి చేరాలని అనేక కష్టప్రయాసలుపడి చేరుకున్నారట. ఈశ్వరుని కృప అపారము. నాభర్తగారిని ప్రతిరోజూ షికారుకు తీసికొనివెళ్లుతూ శరీరాన్ని క్రమంగా సంరక్షణ చేసుకుంటూ జాగ్రత్తగా ఆరోగ్యంలోకి వచ్చేటట్టు చేశాను. దేహపటుత్వం, బుద్ధివికాసం, మనిషి మానసిక ఉత్సాహాన్ని సంతోషాన్ని బట్టిగదా ఉంటవి.

—ఒక ఆంగ్లకథ ననుసరించి

# పిల్లలు - ఎండలు

చంటిపిల్లలకు యెండకాలము చెమట కాయలబాధ వచ్చును. చల్లటి పానీయాలు తక్కువగా దుస్తులు వేయడమువల్ల యివి రావు.

*    *

బూరుగుదూది పరుపులు వేడి. వీటిని ఎండాకాలములో పిల్లలకు ఉపయోగించ కూడదు. సాధారణమగు ప్రత్తిపరుపులే యీ కాలమునకు మంచివి. బూరుగుపరుపులు చలికాలమునకు చల్లటిరాత్రులకు అనుకూలము.

*    *

ఎండాకాలమున పిల్లలకు పక్కలువేయునపుడు OIL CLOTH వేయడము మానాలి.

*    *

పిల్లలతో ఎండలలో ప్రయాణము చేయకూడదు. పిల్లలున్నగదులకు తలుపులకు, కిటికీలకు వట్టివేరుచాపలు కట్టి నీళ్లు చల్లుతూవుండడము మంచిది. పలుమారు నీరుత్రాగించడము, పండ్లరసము ఇవ్వడము మంచిది.

*    *

రాత్రిసమయాలలో పిల్లలకు మామిడి పళ్లను యియ్యరాదు. గడ్డలున్నవారికి అసలే ఇవ్వకూడదు.

*    *

పిల్లలకు పోతపాలు పోయునపుడు ఒకే ఒక ఆవుపాలనే వాడుట మంచిది. లేగలున్న ఆవుపాలైన మరీ శ్రేష్టము. చూలావుపాలు మంచివి కావు.

*    *

పిల్లలకు చెవినుండి నీరువచ్చుట–చీము వచ్చుట మొదలగుజబ్బులు నీళ్లు పోయునప్పుడు అజాగ్రతగనున్నందున కలుగుతవి. నీళ్లు పోయునప్పుడు నూనెకాని నీళ్లు కాని చెవులలోనికి పోకుండుటకై ప్రత్తి పెట్టిన ఈజబ్బులు రావు.

*    *

చిన్న వెడల్పుగిన్నె–నిండుగ నీళ్లు–ఒక చిన్న లోటా–ఇస్తే పిల్లలు విసుగు విరామం లేక యేఅల్లరిచేయక నీళ్లను తీస్తూపోస్తూ ఆడుకొంటూ వుంటారు. ఈఆటవస్తువులకు తోడు నీట తేలునటువంటి బొమ్మలుకూడా వున్న వారిసంతోషమునకు చెప్పవీలులేదు. ఈ నీళ్లతో ఆడుకొనడము పిల్లలందరికీ యిష్టము–మంచిది. దీనివల్ల కండ్లకు, చెవులకు, చేతులకు క్రమశిక్షణ యేర్పడుతుంది.

—యస్. శేషగిరిరావు.

# గృహలక్ష్మి టాకీ ప్రతి విమర్శ

గుప్తేశ్వరరావుగారికి జవాబు

లక్ష్మీకాంతం

తెలుగు సాంఘిక చిత్రం—గృహలక్ష్మి నిగూర్చి నా యభిప్రాయం క్లుప్తంగా ఏప్రెలు మాసపు గృహలక్ష్మి సంచికలో రాశాను.

మే సంచిక వచ్చింది.

ఆ అభిప్రాయాన్ని తీవ్రంగా విమర్శిస్తూ ఆ సంచికలో శ్రీయుత సి. గుప్తేశ్వరరావు గారు రాశారు.

వారి రాతలో సూచింపబడినవి అభిప్రాయ భేదాలు కావు; తెలుపబడినవి పొరపాటులు గావు.

అవి రెండే అయితే అసలు యీ ప్రతివిమర్శనకు ఇప్పుడు అవసరమేమీ లేకపోయేది.

రావుగారు తన విమర్శనావ్యాసం ప్రారంభిస్తూ విమర్శనంటే ఏమో నిర్వచించారు.

బాగానే వుంది.

అయితే అలాగే అందరు—ముఖ్యముగా నిర్వచించిన రావుగారుకూడా—ఆ దారినే నడిస్తే ఎంతో బాగుండేది.

కాని రావుగారే అలా చేయలేదు. నాలుగడుగులు నడవకముందే పప్పులో అడుగు వేశారు. అంతే గాదు; ఒకప్రక్క దూషించడమూ భూషించడమూ విమర్శన ఎంతమాత్రమూ కాదంటూనే వ్యక్తి దూషణను సంకోచించకుండా ప్రారంభించారు.

ఈ దూషణకు కారణమేమైనా వుందా అంటే ఏమీ కనపడదు— మొదట నేను రాసినదాన్లో స్పష్టంగావున్న వాక్యాలను అర్థం చేసుకోకుండా ఆత్రపడడం తప్ప.

అందుచేత యీ ప్రతివిమర్శన తప్పని సరిగా ప్రకటింప వలసిన అవసరం కలిగింది.

వారివిమర్శనలో మొదటి అభియోగం ఇది. 'కళా దృష్టితో గుణావగుణాలు, లోపాలోపాలు విమర్శించక లోపాలనే ఎంచ ప్రారంభించారు.'

ఇది సత్యదూరమంటాను. స్వయంగా వారు తెలుసుకోవాలంటే నా మొదటి వ్యాసం వారింకో మారు చదువవలసి వుంటుందని మనవి.

'గృహలక్ష్మి తెలుగు సాంఘిక చిత్రాల్లో మొదటిది' అంటే ప్రథమ తాంబూలం పుచ్చుకుంటూవుంది; ఇప్పటివరకు తయారైన వానిలో నయం, అని నా వుద్దేశం.

మొదటిది అన్నదానికి ఉత్తమమైంది అనే అర్థం కూడా వున్నట్లు రావుగారు ఎందుకు గ్రహింపలేకపోయారో తెలియదు.

కాని రావుగారు 'మొదట తయారుచేయబడ్డది' అనే అర్థంచేసుకొన్నారు.

దాంతో నామీద విరుచుకొని పడ్డారు.

మఖలో పుట్టి పుబ్బలో మాడిన 'ప్రేమవిజయా'న్ని అచ్చంగా అరవంలోనుంచి ఏమాత్రమూ ఉపజ్ఞ లేకుండా తెలుగుకు దించబడిన 'బాలయోగిని'ని అసలు పత్రికల్లోనైనా చూడజాలని దురదృష్టం ఎవరికీ పట్టవలసిన అవసరం లేదు. ఆ దురదృష్టాన్ని వూహించి ఒకరిపైన వురకవలసిన అక్కరా లేదు.

ఈ అభియోగంలో ఇంకో విశేషముంది. 'కేవలము లోపాలనే ఎంచ ప్రారంభించారు,' అన్నారు గదా రావుగారు. అందులో ఏ కించిత్తయినా సత్యమునేదివుంటే పైవిమర్శన వాక్యంకూడా లోపాల్లోనే చేరుతుందా?

ఆలా కాకపోతే రావుగారి వ్రాతలకు సమన్వయం ?

ఇలాంటిదే ఇంకోటి.

'ఆంధ్రులకు ఒక తారను (కాంచనమాల) చేకూర్చేరు' అన్నాను. 'అది కొత్తదిగాదు పాతదే' అన్నారు రావుగారు.

నిజమే అంగీకరిస్తాను.

అయితే ఆమె అభినయాన్ని 'విప్రనారాయణ'లో మెచ్చుకొన్నారు, అంతే. గృహలక్ష్మిలో చూచి 'బలే' ఆంధ్రతారల లేలదన్నే దొరుకుంది; అనుకొన్నారు ప్రేక్షకులు.

అంటే—

గృహలక్ష్మిటాకీ నిర్మాతలు కాంచనమాలను తారగా తయారయే అవకాశాలు బాగా కల్పించారు అభివృద్ధి చేశారు.

ఇది నా వుద్దేశం.

నా వ్యాసాన్ని 'అన్నీ లోపాలే' క్రింద కట్టేసిన రావుగారు దీన్నికూడా లోపాలక్రింద గణించేశారా?

రావుగారి విమర్శనాంశాలు బాగా తెలియాలంటే నా మొదటి వ్యాసంలో గృహలక్ష్మిలోని ఆధిక్యతను గురించి వ్రాసినతరువాత దాని లోపాలను గూర్చి వ్రాసిన ఆ వాక్యాలు ఇక్కడ ఉదహరిస్తే బాగుంటుందనుకుంటాను.

''గృహలక్ష్మి'ని చిత్రించడానికి యీచిత్రం నీతి అవినీతుల ప్రాబల్యాన్ని Contrastగా ప్రదర్శించింది. ఆ అవినీతి ప్రదర్శనం శ్రుతి మించిపోయినది. అసభ్యమైనది. అసహ్యంకూడా అయినది. అభిమానగౌరవాలున్న యేస్త్రీయైనా యీచిత్రాన్నిచూచి అందులో స్త్రీత్వానికి చేకూర్చబడ్డ అగౌరవాన్ని చూచి నొచ్చుకొనకుండా వుండదు.

కథాసంవిధానం సాంఘికమైనా దైనికజీవితాన్ని ప్రతిబింబింపచేయడములో ఎన్నో ఫల్టీలు కొట్టింది. ఎక్కడ చూచినా కృత్రిమత్వము కనబడుతూ వచ్చినది. డాక్టరు భార్య భారతీయ సంప్రదాయానుసారంగా గృహలక్ష్మిఅయినా ఆమె నివాసములో భారతీయ వాతావరణం మందునకైనా కనపడదు. భరతనాట్యం చూర్ణంలో రాధ రసభావాలు లేని – రాచ్చిప్పలావుంటుంది. బ్రాహ్మణుసన్నలు ఎక్కడపడితే అక్కడంతా ప్రత్యక్షమై హాస్యానికి బదులు అసహ్యాన్ని కలిగిస్తారు. త్రాగుడలవడేవలకు డాక్టరు అవ్యక్తమైన బాధపడే వేషంటులాగ వ్యవహరిస్తాడు. మాధురి తనలో స్త్రీహృదయం మాయమైనట్టు అస్వాభావికంగా 'అతి' గావర్తిస్తుంది. మార్వాడీ అన్నం తురకాడిలా వుంటాడు. ఎంతమాత్రమూ అవసరములేని భాజా మాధురియింట్లో ప్రాముఖ్యత సంపాదిస్తాడు గోపీనాథుడు ఏముక్క మాట్లాడినా —అది వ్యావహారికభాషయినా–గ్రాంథికపక్కిలో ఉపన్యాసధోరణి అందుకుంటాడు. చచ్చేటట్టు దెబ్బలుతిన్న మాధురికి హాస్పిటలుకువెళ్లి ప్రాణసంరక్షణ జేసుకోవడం గాకుండా కోర్టులో సాక్ష్యమిచ్చి మరి చావవలసినగతి పట్టినది. దెబ్బలుతగిలి చస్తుంటే హాస్పిటలుకు గాకుండా కోర్టుకులాగి సాక్ష్యమిప్పించడం ఏచట్టం లోలో తెలియకుండావున్నది. ఆస్తి మార్వాడిపరం కావడంలో ఏచట్టాన్ని అనువర్తింపజేశారో ?......'

ఇందులో వ్రాయబడిన వాటికన్నిటికీ రావుగారర్థ్యంతరం చెప్పలేదు. అంతవరకు నయమే.

చెప్పిన అర్థ్యంతరాలుకూడా ఎంతవరకు సమంజసంగా వున్నాయో పాఠకులు సులభంగా గ్రహిస్తారు.

అందు ఒకటి. 'స్త్రీలు నొచ్చుకోవటం రాధ పాతివ్రత్యబాధాసహనానికా? లేక మాధురి కలుష హృదయానికా?' అన్నది రావుగారి ప్రశ్న! జబాబు వ్రాయకముందు వారినే ఒకటి ప్రశ్నించాలి.

'రాధ పాతివ్రత్యబాధ సహవానికా?' అన్నారు.

పాతివ్రత్యము బాధామూలమని రావుగారంటారా? లేకుంటే దీని భావమేమి—?

అలాగే అనుకుంటే, 'పాతివ్రత్యాన్ని ద్వేషించే భారతమహిళ ఇంకా జన్మించలేదని నా యూహ' అన్న రావుగారి యూహ ఎంత నిరాధారమై పోతుంది?

ఇంతకు స్త్రీలు నొచ్చుకోవడము పతివ్రతపడ్డ బాధలకూ గాదు; పూర్తిగా మాధురి కలుకుహృదయానికీ గాదు.

మాధురి వేశ్య గావచ్చును. అంత మాత్రమున ఆమె వద్ద మానవత్వము నశించదు—స్త్రీత్వము చిక్కిపోదు.

మాధురి—కొంతవరకు ఆమె తల్లి—తాము స్త్రీల మనుమాట మరచి అసభ్యమైన మాటలు మాట్లాడుతూ అంతకంటే అసహ్యమైన చేష్టలు అవయవ ప్రదర్శనములు చేస్తూవుంటే ఏ స్త్రీయైనా నొచ్చుకోకుండా వుంటుందా?

ఇదంతా వేశ్యలకు సర్వసాధారణ మంటారా రావుగారు?

అయితే మాత్రం—

అతి గోప్యంగా గృహాంతర్భాగాల్లో జరిగే విషయాలన్నీ బహిరంగంగా చిత్రాల్లో చూపాలంటారా?

అలాంటి ప్రదర్శనాలు మాధురివంటి ఏ ఒకరిద్దరికో తప్ప అందరికీ ఆహ్లాదకరమైన వంటారా రావుగారు?

తరువాత—

సరళమైన భాషలో వ్రాసినదాన్ని పెడర్థం చేసుకుని రావుగారిని వ్యక్తిదూషణలోనికి దూకించిన మరో దురదృష్టఘట్టం.

'త్రాగు డలవడేవరకు డాక్టరు అవ్యక్తమైన పేషంటులాగ వ్యవహరిస్తాడు' అంటే 'త్రాగు డలవడగానే' అని అర్థం చేసుకున్నారు రావుగారు. త్రాగుడు ప్రారంభము గాకముందు అని స్పష్టంగా వున్న అర్థం వారికి తోచనేలేదు.

పాపం! తోచేవుంటే 'విమర్శకులు, ఛత్రాజులు రంధ్రాన్వేషులు, కాగూడ'దని నిర్వచిస్తూ విమర్శన మొదలిడిన విమర్శకులకు రావుగారు 'మద్యం మొదట తాగిన వాని ప్రకృతి అలాగే వుంటుంది........ అంటే ఇదివరకు ఎవ్వరూ నటించనంత స్వాభావికంగా నటించారనాలి. ఆమాట కొంపపేరాలో ల. కా. గారే వొప్పుకున్నారు. అంటే వారికి రెండు నాలికలేనా వుండాలి.......రంధ్రాన్వేషణ మరచిపోయేనా వుండాలి' అని వ్యక్తిదూషణ జోరుచేస్తారా?

దురదృష్టం: వారికాలా అర్థమూ కాలేదు; వారు వ్యక్తిదూషణ చేయకా పోలేదు.

'గోపీనాథుని సంభాషణ ఉపన్యాస ధోరణిలో నడుస్తుంది' అన్నాను. అంటే రావుగారు 'అతని భూమిక అర్థం ల. కా. గారికి బోధపడి వుండదు' అని వూహించుకున్నారు.

సాధారణంగా వూహ సత్యానికి చాలాదూరంగా వుంటుంది.

గోపీనాథుడు తన వుద్యమాన్ని వుపన్యాసాల ద్వారా వ్యాప్తిచేస్తూ వుండవచ్చు. తాగుబోతులకు హరిజనులకు ఉపన్యాసాలు దంచాయించడానికి ఎవరూ వద్దనరు.

కాని—

ఇంటా బైటా దైనిక జీవితంలో అడ్డంవచ్చే బంధువులతోనా, తదితరులతోనా ఏకాంతద్విషయము మాట్లాడినా ఉపన్యాసధోరణి ప్రారంభించడం ఎంత అసహ్యంగా వుంటుందో రావుగారు గమనించక పోవచ్చు. విన్నవారూ కన్నవారు అసహ్యించుకోకుండా మాత్రం పోరు.

దెబ్బలు తిన్న మాధురి కోర్టుకు తీసుకు పొమ్మనే చెప్పింది, దాన్ని రావుగారు మాత్రము అతి శ్రద్ధగా గమనించారు అనుకుందాం.

అయినా—

'మాధురిని కోర్టులోకి తీసుకపోక హాస్పిటలుకే తీసుకపోతే కథాకలాపం చల్లగా మారి పూరుకుంటుంది. అపుడు విషాదాంతం అవుతుంది' అన్నారు రావుగారు. దీనికి ప్రత్యుత్తరం నా మొందటి వ్యాసంలోనే వుంది.

'కథాకలాపం చల్లగా మారి పూరుకుంటుం'దని అంటారుగదా రావుగారు. అస్వాభావికమైన విషయాలని చూపెడితే ఆ చిత్రం తగలబడి పూరుకుంటుందనికూడా రావుగారు అంగీకరిస్తారా?

'ఇతివృత్తము మొందలు Settings, Background music, Photography, Lighting, Recording అన్నీ బాగున్నాయని వ్రాస్తూ కొసని అనుకోతగ్గ అధిక్యతేమీలేదు, అనడంలో వారి అభిప్రాయం అయోమయంగావుంది!' అన్నది రావుగారి అభియోగం.

ఇందులో ఎంత భాషామిశ్రమం వుందో అంతకంటే ఎక్కువగా సత్యాసత్యాల మిశ్రమం వుంది.

ఇతివృత్తము; ఇతివృత్తం బాగుందని ఎక్కడన్నానో రావుగారు వ్రాసివుంటే బాగుండేది. లేకుంటే ఇది వారి వూహ అనైనా చెప్పివుంటే మరీ బాగుండేది.

ఇక సెట్టింగ్సు; నా వ్యాసంలో వాటి ప్రస్తావనే లేదు.

'అన్నీ బాగున్నాయి' అని నేను వ్రాశానన్న రావుగారి వాక్యం సత్యానికి వేయిమైళ్ల దూరంలోవుందని మనవి.

ఇందులోని సత్యదూరమైన విషయమంతా తీసివేస్తే మిగిలింది బ్యాక్‌గ్రౌండు మ్యూజిక్, ఫోటోగ్రాఫీ, రికార్డింగ్—ఈమూడు.

వాటిలో బ్యాక్‌గ్రౌండు మ్యూజిక్ బాగావుంది అని అంగీకరించాను.

'ఫోటోగ్రాఫీకూడా బాగానే తీయడానికి ప్రయత్నించినట్లు కనబడుతున్నది' అని మాత్రమే అన్నాను.

'శబ్దగ్రహణం బాగున్నది' అన్నాను. ఇలా అని, అనుకోతగ్గ అధిక్యతేమీలేదు, అనడంలో అయోమయత్వంవుందో మరింకేమైనావుందో పైవిషయాల్ని శ్రద్ధగా గమనించిన పాఠకులే నిర్ణయించుకుంటారు.

సరిగా తీయడానికి ప్రయత్నించిన ఫోటోగ్రాఫీ, చక్కని శబ్దగ్రహణం, బ్యాక్‌గ్రౌండు మ్యూజిక్ ఇవి మూడూ వున్నంతమాత్రాన్నే ఒకచిత్రం ఉత్తమమైంది అనడానికి రావుగారికి సాహసముందేమో కాని నాలో నాస్తి.

పోనీ యింతగా విమర్శించినరావుగారు గృహలక్ష్మిలోని కొన్ని ఉత్తమగుణాలైనా చూపించివుంటే బాగుండేది.

వారంతకంటే మంచిపనేచేశారు.

నేను ఏకరువుపెట్టిన లోపాలతోపాటు యింకా కొన్ని చూపించి నాతో యేకీభవించినందుకు వారికి కృతజ్ఞుణ్ణి.

ఇప్పటికి చదువరులు రావుగారి విమర్శలోని సత్యం గ్రహించి వుంటారు.

'కాబట్టి ల. కా. గారు విషయనిర్ణయం చేయకుండా ఏదో లాకాయి టూకాయి అవకతవక అమ్మమ్మ కబుర్లు విమర్శించారు' అనే వ్యక్తి దూషణనూ, ఒకవేళ తిట్టాలంటే పేరుపెట్టి నోరుదురద తీరేటట్టు తిట్టాలికాని—' అని 'కాని' వ్రాతలలోని అసందర్భాభిప్రాయాలనూ ఎంతవరకు సహృదయులు మన్నింపదగివుంటారో సులభంగా పాఠకులే గ్రహిస్తారు.

నాయనవి యేమంటే—

ఏదో విమర్శించాలనే ఉద్రేకంలో వ్రాసింది అర్థంచేసుకోకుండా దూషించడమూ లేక లేనివి కల్పించి వెక్కిరించడమూ, అసంగతాలను సాధింప ప్రయత్నించడమూ—ఇటువంటి విమర్శనా ప్రయత్నాలు చేయడము భాషకు అపకారం చేయడమౌతుంది. రచయితల ననవసరముగా దూషణలకు గురిచేసినట్లౌతుంది; పత్రికలను ఖరాబ్ చేసి పాఠకులకు తీరని విసుగే కాదు, అసహ్యంగూడా పుట్టించడమౌతుంది. దీన్ని గుప్తేశ్వరరావుగారు మననంచేసి ఆచరణలో పెడితే చాలా కృతజ్ఞుడుగావుంటాను. *

# సినీమా వార్తలు

## మోహినీ భస్మాసుర

రంప చోడవరము గ్రామాలు తూర్పు గోదావరి ఏజన్సీలోనివి. ఈ ప్రాంతాలు ప్రకృతి రామణీయకానికి పేరుపొందినవి. సుప్రసిద్ధుడైన అల్లూరి సీతారామరాజు కోయదొరలందరినీ సైన్యంగా తయారుచేసి బ్రిటిషు ప్రభుత్వాన్ని ప్రతిఘటించింది యీ ప్రాంతాల్లోనే.

ఇప్పుడు ఆంధ్రటాకీవారు శ్రీయుత పుల్లయ్యగారి దర్శకత్వాన 'మోహినీ భస్మాసుర' చిత్రాన్ని యీ ప్రాంతాల్లో తయారుచేస్తూ వున్నారు. ఇందులో దాసరికోటిరత్నం, తుంగల చలపతిరావు, ఎ. వి. సుబ్బరావు, పుష్పవల్లి, నగరాజకుమారి మొదలగు నటీనటులు పాల్గొంటున్నారు.

## భక్త జయదేవ

ఆంధ్రసినీటోన్, వైజాగ్, వారిచేత ఏకకాలంలో తెలుగు, హిందీ భాషల్లో తయారుచేయబడుతూవుండే 'భక్తజయదేవ' పూర్తికావస్తున్నట్లు తెలుస్తూవుంది. తెలుగులో శాంతకుమారి (నాయిక) రెండు చింతల సత్యనారాయణ (నాయకుడు) వెల్లంకి వెంకటేశ్వరుడు (ప్రతినాయకుడు) మంగిపూడి కామేశ్వరరావు (పురోహితుడు) వి. వి. అప్పయ్య పంతులు (జయదేవుని హరిజనమిత్రుడు) సురభి కమలాబాయి (హరిజనమిత్రుని భార్య) రాధారాణి, మొదలగువారు పాల్గొంటూ వున్నారు.

హిందీ చిత్రంలో హీరెన్ బోస్ (ఈ చిత్రానికి డైరెక్టరు) నాయకపాత్ర నటిస్తున్నాడు. స్నేహలత (నాయిక) రాధారాణి, సురభి కమలాబాయి మొదలగువారు నటిస్తున్నారు.

హీరెన్ బోస్ డైరెక్టుచేస్తూ సంగీతాన్ని శ్రద్ధగా గమనిస్తారని తెలుస్తూవుంది.

## మాలపిల్ల

సారథి ఫిలుమ్సువారిచేత తయారవుతూవుండే 'మాలపిల్ల'నుగూర్చి ప్రకటన లెంత కాహాటంగా చేయబడుతూవున్నాయో, పనికూడా అంత జోరుగా జరుగుతూవున్నట్లు తెలుస్తుంది. ఈ సాంఘికచిత్రం ఏలోపాలులేకుండా వస్తుందని రామబ్రహ్మంగారు అతిశ్రద్ధ తీసుకుంటున్నారని కొంతమంది అనుకొంటున్నారు. అలా కావాలసేవుంది మరి.

## భక్త మార్కండేయ

కుబేరా ఫిలిమ్సువారు 'భక్త మార్కండేయ'ను త్వరగా తయారుచేస్తున్నారు. త్వరగానే విడుదల అవుతుంది. జి. యస్. స్వామి, గగ్గయ్య, శ్రీరంజని, శాంతకుమారి ప్రభృతులు ఇందులో నటిస్తున్నారు.

## కచదేవయాని

ప్రాణరక్షణకు బదులు దేవయాని ప్రణయభిక్ష కోరుతుంది; కృతజ్ఞతాపూర్వంగా ప్రాణాన్నైనా యిస్తానుగానిసోదరీప్రేమ మార్చుకోనంటాడు కచుడు. ఈ కథకు రామణీయకంకల్గించాలని ప్రకృతిదృశ్యాలు ఎక్కువగాచేర్చినట్లు తెలుస్తుంది. ఇందు కృష్ణవేణి, పి. లక్ష్మణస్వామి, రఘురామయ్య, చోప్పల్లి, కుంపట్ల, మొదలగువారు నటిస్తున్నారు. ఇది రాధా ఫిలింకంపెనివారి చిత్రం. బి. వి. రామానందంగారు డైరెక్టు చేస్తున్నారు.

* దీనిపై విమర్శనలు ప్రకటింపబడవు. ఈవిషయ మింతటితో ముగించడమైనది— సంపాదకుడు

# కాశ్మీర మజిలీలు

(బస్సుకథ భాగవతము)

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

నాలో నే నిట్లు వితర్కించుకొనుచుండ నెదుటనున్న బోండా నన్ను పలుకరించినాడు. సొంతధోరణి మొదలిడినాడు. తన యూరు అమృతసరమునకు మూడుక్రోశుల దూరమందున్నదట. తనపూర్వులు కనోజ్ సమీపమందలి ఉత్తరపూరిలోనుండువారట. తనకు తొమ్మండుగు రాడుబిడ్డలట, ఇరువురు మగబిడ్డలట. పెద్దవాడు ఇంటినంటియుండి సేద్యముసేయించుచు, తలిదండ్రులకు నేడుగడయైయున్నాడట. రెండవవాడే తన కడగొట్టు బిడ్డయట. వాని వయసు పదునాలుగేండ్లట. అమృతసరమున మేనమామ యింటనుండి హిందీ సంస్కృతములు చదువుచున్నాడట. కొడుకును చూచుటకై అపుడవుడు తాను అచటికి పోవుచుండునట.

బోండాధోరణి నడచుచునేయున్నది. రాత్రి ఎనిమిదిగంటలు కడచిపోయెను. కాని, ఇంకా బస్సు కదలలేదు. మహాకాయుడైన ఒక ప్రయాణీకుడు రెండుసీట్ల నడుమదారలి అవస్థపడ దొడగినాడు. తోడివారు సగమువఱకు నూడియున్న సీటును పూర్తిగ నూడ వెఱికి, వానిని లేవనెత్తి "పతితపావనుడైరి". డ్రైవరు అఱువసాగినాడు. బస్సులో కొంత యలజడి బయల్దేరినది. "ఠండారహో! ఠండారహో!" (శాంతింపుడు! శాంతింపుడు!) అని ఒక్కొకరునితో చెప్పసాగితిని. "ఠండారహో! ఠండారహో!" అని బుడంకాయి అఱువసాగినాడు. బస్ కండక్టరును పిలిచితిని. జవాబు రాలేదు. ఆ మహాశయుడందు లేనేలేడు.

పదునాలుగు భువనములలో కండక్టర్ ఏ భువనమందు విహరింపబోయినాడో ఎఱుగను. కొనినటికట్లకు తర్పణము వదలి, భక్తి పూర్వకముగా బస్సుచుట్టు ముమ్మాఱు ప్రదక్షిణముచేసి, వేఱుత్రోవను చూచుకొన దలచితిని. నశీరేయిగాని నాటికి లాహోరు పోవు రైలులేదు. పోనీ పంతము పట్టి బస్సుతో పందెమువేసి నడచిపోదమని నను దూరము సామాన్యమైనది కాదు. నిశీథమున ముప్పదిరెండు మైళ్లు కాలినడకను పోవుటెట్లు? కడుపులో ఇపుడు ప్రోగైన స్టీమ్ ఒక మైలునడువగనే ఖర్చగునేమో! చిత్తై తెరువునడుమ పడెదనేమో యనుయడలు ఏదారినుండియో వచ్చి గుండెలో ప్రవేశించినది. ఇంత ఇబ్బందికి కారకుడైన మహాశయుని మూపెక్కిపోదుననుకొనినను, వాడు పొట్టి పిచికయైపోయినాడు. వానికి మూపే లేదు. తిరిగి దాదాజీపై ఫిరంగువలె పడుటకు నామనసొప్పలేదు. డి. పి. మీది కిక బుద్ధిపాఱలేదు.

గంటవెంబడి గంట కడచినది. స్నాన సమయము దాటినది. హైరాను అధికమైనది. ఎప్పటినొప్పి తలలో ప్రవేశించి తాండవమాడ దొడగినది! సహనము హృదయమునుండి అంతర్ధానమైనది. "అరే! కండక్టర్!" అని పిచ్చివానివలె అఱచితిని. ఎందో విహరించుచున్న వాని చెవులో కేకపడినది.

నిముసములో బస్సులోని కొక స్వరూపము తొంగిచూచినది. "క్యా హాల్‌చాల్?" అని కుశల ప్రశ్న వేసినది. గుండెలో భగ్గుండ రవుల్కొనినది! "హాల్‌చాల్"ట. ఇందటి నీవేళ నిట్టి యిబ్బందికి పాల్పడజేసి ఏమియు నెఱుగనివానివలె పాపము క్షేమ మరయుచున్నాడు! చివాలున బస్సునుండి యుఱికి "ఇది కదలునా కదలదా? ఇది క్షమింపరాని దోషము. తగుచర్య దీసి కొనమందువా? ఎవరి పైకము వారికి వాపసుచేసి ఎదుటినుండి లేచిపోదువా?" అని బిగ్గఱగా పల్కితిని. నామాటలు తనకుకాక ఆకాశవాణికి ఉద్దేశింపబడినవని వాడు ఊహించియుండును. నా నుడువులు సంపూర్ణముగ వినక పెద్దంజలువేయుచు, నీమూలనుండి ఆమూలకు నడచి ఏదో సొంతఘోష నేకరువుపెట్టుచు, ఏవో హిందూస్థానీ పేరుల నెత్తుచు రంకెలువేసి దూరముగపోయి నిలిచినాడు. నాలుగడుగులు ముందునకువేసి "ఏమందువు?" అని అఱచితిని. "ప్రూఫియే బాబూ సాబ్ ప్రూఫియే!" (అడుగుడు అయ్యా అడుగుడు) అని బస్సులోని మహాపురుషులు నిముసముసేపు కయ్యముఃమాని నాకు హుషా రీయసాగిరి. నాపలుకు సగము చెవినిబడినంతనే నిలిచినవాడు వడివడిగ (తోడ్తోడనే సొంతసొదను సాగించుచు) నీమూలనుండి నామూలకు చతురంగములోని 'సెగటు'వలె నడచి చివాలున నిలిచిపోయి నాడు.

ఈ వింతమనిషియొక్క వింతప్రవర్తనము నా కబ్బురము గొలిపినది. వీని వాలకమే ఒకమాదిరిగానున్నది. ముదురు మొగమునిండా గంట్లు! చెంపమీదికి దిగజాఱిన పాగా! వీని వయసు నలువదేండ్లుండును. కదువడిగగాని ఈతడు మాట్లాడడు; ఇదేరీతిగగాని నడువడు. రెండు నిముసముల కొక పర్యాయము విగ్రహమువలె కొంతసేపు గడసి మాట వినవచ్చినంతన కిఱుకిఱుమను చడావులతో చరచర మఱల నడువ గడంగును. ప్రస్తుతవిషయమునకు లవమైన సంపర్కములేని సొంతరొదను మొదలిడును. వీనికి ప్రియమైన మోటు మాటలు రెండు మూడున్నవి. ఉండి యుండి వీనితోనే ఈతడు తన ధోరణి మొదలిడుచుండును. మాటలాడునపుడు ముక్తముఖమునుండి మెఱపులు వెడలుట గనుపట్టితిని. అవి ఏమైయుండునని మఱింత తీక్ష్ణముగ పరీక్షించితిని. పాపం! పల్లువరుస పై నీతడు బంగారుచుక్కలను చెక్కించుకొనినాడు! ఈరీతి యలంకరణమును స్త్రీపురుషులలో ఉత్తరహిందూస్థానమున పెక్కుసారులు చూచితిని.

బుడంకాయి నావెనుక బస్సునుండి మాటముల్లెలతో దుమికినాడు. నా మాటలనే తానుకూడ పలుకుచు గొంతుక చిరుగునట్లఱచుచు, కండక్టరు వెంట నుఱుకు లెత్తును కోతివలె ప్రవర్తించుచున్నాడు. ఓటికుర్చిపై గంభీరముఖుడై కూర్చుని యున్న కేలిబర్ "బలే! బలే!" యని వీని

నృత్యమును ప్రోత్సహించుచున్నాడు. బస్సులోనివా రొక్కరొక్కరుగ దిగిరి. "బాబూజీ! బాబూజీ!" అని బోండా మాటిమాటికి కేకలు వేయసాగినాడు. తానుకూడ క్రిందికి దిగవలెననియే ఆతని యుద్దేశము. కాని వానిని దింపుటకు దిగ్గంతులే రావలెనని గ్రహించియేయుంటిని. కావున వాని దరిజేరనైతిని.

కొండలు పొట్టిపిదికి వేడుకజూచుచు, ప్రయాణ మాలశ్యమగుచున్నదని కొండలు శారములను మిరియములను నూఱుచు, "భోజనసమయము దాటిపోయినది" అని మఱికొందఱు చతికిలపడి యఱచుచు వేర్వేఱు తెఱగుల బ్రవర్తింపసాగిరి. సగము విఱిగిన మూడుకాళ్ల కుర్చీమీఁది గొప్పయుద్యోగి తన వదనారవిందమును మఱింత గంభీరము గావించి, ముక్కద్దములను ముక్కుతుద వ్రాలించి మొగము సగము వంచి "టికెట్ లేలేవ్! లేలేవ్ టికట్!" అని తఱచుగా అఱచుచునే యున్నాడు. "బస్సు కదలదేమి?" అని ప్రయాణీకులు ప్రశ్నించినపుడు "బోల్తా హుం టికెట్ లేలేవ్!" ("టికెట్ తీసుకొనుమని చెప్పుచున్నాను") అని యాతడు స్వరము హెచ్చించి పలుకుచున్నాడు. ఎవరిధోరణి వారిదే! సంబంధ బాంధవ్యమెక్కడైనా కనుపించలేదు. కండక్టరు ప్రవర్తన మట్లేయున్నది. "ఈ మోళీ చూచుట తగదనియు, ఇక కిక్కురుమనుట అవివేకమనియు, ఇందింకను తడసియుండుట మఱింత యవివేకమనియు" తలచి బుడంకాయిని పిలచి, గిఱ్ఱున నందుండి తిరిగితిని. మఱలపోయి దాదాజీ కొంపపై పడకతప్పదని ఇంత గ్రంథము నడచినపిదప గ్రహించి నడుముగట్టి నడువదొడగితిని.

పదియడుగులు వేసితిని. ఇంతలో "బాబూజీ! బాబూజీ!" అను కేకలు వినబడినవి. నిముసము నిలువంబడితిని. మూటముల్లెలతో దాపునుండి నడచు పొట్టిపిదికి కూడ నిలచినాడు. "ఆయియే! ఆయియే! చల్ తీపై" అను యఱపులు వినబడినవి. కంఠస్వరము బోండాదని గ్రహించితిని. ఆక్షణమే హార్న్ వినబడినది. చచ్చిన గొడ్డువలెనున్న బస్సునకు ఊపిరివచ్చినది కాబోలు. నాతో నేమియుజెప్పక సామానుతో బుడంకాయి వెన్కకు పరుగెత్తినాడు. నే నట్లే నిలువంబడిపోతిని. దిగవిడిచిన బస్సులో ప్రవేశించుటకు మానసమియ్యకొనుచుండుటలేదు. కాని "దానితో గాని, దాని కండక్టరు డ్రైవరులతోగాని పంతము నాకేల?" అని పరక్షణమందే యోచింపదొడగితిని. ఇంతవఱకు కాలహరణమైన పిదప ఫలమునందక అప్రతిభుడనై తరసిపోవుట తగదనియు, కడచిన దానిని త్రవ్వుకొనక ఇప్పటియుదను పోనాడక, కదలిపోవు బస్సులో ప్రవేశించుటే ఉచితమనియు, కావలసినది కార్యసాధనము కదాయనియు తలపోసితిని. పైగా పిదికిగా డపుడేపోయి సామానుతో బస్సులో చతికిలపడి "ఆయియే! ఆయియే!" ("రండు, రండు") అని ఎడతెఱపిలేక నన్ను పిలువసాగినాడు.

పునర్గమనమును ఆత్మగౌరవమునకు ముడిపెట్టుట తగదనియు, బోడిగోడలలో విడియుటకు భగవంతుడు సమ్మతింపనట్లు గణనీయములు కాని అల్పాంశములందు ఆత్మగౌరవము తన పీఠమును ప్రతిష్ఠించుకొనదనియు, ఉత్కృష్టాంశములందే అది స్వీయమందిరము నవలోకించి (గుండెలో జొరబడు నవశక్తివలె) అందు ప్రవేశించి జేగంట మ్రోగించుననియు, ఫాల్స్ ప్రెస్టిజ్ బండమెదడుగలవానికి పనికివచ్చునుగాని మతిమంతునకును, ధృతిమంతునకును గాదనియు, ఒడుదొడుకు తలపులతో ముందంజవేయుటకంటె గభీర యోచనతో వెనుకంజవేయుటే ఘనతరమైన కార్యమనియు, సంయమసామర్థ్యములతో అంకితమైయుండు ఈ వెనుకంజ ఆత్మశక్తిగలవానికే, దూరదృష్టిగలవానికే, విశాలహృదయము గలవానికే సాధ్యమనియు, ఇట్టి వెనుకంజ దశయోజనముల ముందంజకు కన్నతల్లి కాజాలుననియు, జీవితగతి జంత్రగమనము బోలునది కాదనియు, కిన్నెరచానవలె దృష్టిలో నెందో నగుమోమున నెలయు ఉదాత్తాశయగళమునకు తాళిగట్టునది యాత్రయందలి భావలక్ష్మి గాని అందలి యడుగులసంఖ్య కాదనియు, మేధావులైన రాజకీయవేత్తలును, తాత్త్వికులును, ఆచార్యులును, ప్రవక్తలును, మతనేతలును సమయాసమయములందు వెనుక నిలిచియే, శిరములు వాంచియే, లొంగియే స్వీయమహత్త్వమును ప్రకటించి లాతివారి మెడందలందలి పశుప్రవృత్తులను పడగొట్టి, ప్రజవనితలుపోలు సద్భావముల కందురహదారు లేర్పఱచి, మనుష్యజీవితమున రాసక్రీడనే కాంచి, మివ్వులగులికి జయగీతిక లాలపించిరనియు, క్షుద్రహృదయుల కొద్దిచూపులుగాని, మోటకుల పరియాచకములు గాని, దుర్మతుల మెత్తిపొడుపులు గాని, దూరదృష్టికిని పూర్వాపరాంశములను గుఱించిన ఉచితచింతనమునకును నలవడని భావదరిద్రుల ఈసడింపులు గాని గర్భమున దేవదేవు నిడికొనిన దేవకివలె నిజాంతరంగములందు మణికాంతులీను విజ్ఞానవిభవము నిడికొనిన మహాత్ముల మనసులను ముట్టజాలవనియు, అవినాభావసంబంధము గల వారి మతికిని గతికిని నడుమ నివి గట్టుల దొరను నిలుపలేవనియు, ఆత్మవిశ్వాసమును దృఢనిశ్చయమును జయవిజయులై హృదయమందిరద్వారమున పాలకులైయుండ బరంజ్యోతి అంతరంగగర్భాలయమున తేజరిల్లుచుండ ప్రతికూలాభిప్రాయములును, నిష్ఠురోక్తులును, అసురసేనబోలు అనిష్ఠులును, అరవిందములపై నడుగులు వేయుచు లుంబినీవనమున జరించిన అవతారపూరుషుని గమనమును బురుడించు ఉదాత్తజీవితగతి కెట్టి దుర్గతి తేజాలవనియు చిత్తమువచ్చిన ట్లంతరంగమున భావకందుకములను దొరలించుకొనుచు, తొట్రుడనే అడుగులువేయుచుపోయి బస్సులో ప్రవేశించినని. "ఆయా! బాబ్జీ ఆగయా!" అని లోనిప్రముఖులు మహోల్లాసమున నఱచిరి.

# పుష్పచయము

## స్త్రీ పురుషులకు సమానహక్కులులేని నాగరికత హుళిక్కి—

ఏజాతిలోగూడ సగముమంది విద్యావిహీనులుగనున్నచో ఆలాటిజాతి ఎప్పుడుగూడ వృద్ధికి రాజాలదని చాలాకాలము క్రిందటనే ప్లేటో మహాకవి "రిపబ్లిక్" అనే గ్రంథములో వ్రాశాడు. పైన విద్యను గూర్చి చెప్పిన సంగతులే వివిధరీతుల సంచరించే స్త్రీపురుషుల కందరికినిగూడ వర్తిస్తాయి. ఏ దేశములోనైనా స్త్రీలు పురుషులకన్న వెనుకబడి యున్నారంటే ఆదేశము నాగరికతా ముఖ్యసూత్రములలోనే చాల వెనుకబడి యున్నదని చెప్పితీరాలి. పురుషుని నాగరికత కంతటికిని స్త్రీయే ముఖ్యకారణ మనియెడు తరతరములవాటి పురాతన అభిప్రాయములవల్ల నేడు స్త్రీల హక్కులకే భంగముకల్గుస్థితి యేర్పడుచున్నది. గనుక దేశములో నాటికిని నేటికిని గల వ్యత్యాసముల నొకసారి పరీక్షించి చూతము.

భారతదేశములో స్త్రీయే అధిష్ఠాన దైవము. ఆమె చిన్నప్పటినుండి ప్రేమించి, కాపాడబడి, తుదివరకును పురుషునిచే చాల పవిత్రధనముగ కాపాడబడుచుండును. ఏ దుర్మార్గుని క్రూరదృష్టి ఆమె సౌందర్యముపై పడకుండ ఏకాంత స్థలములలో నుంచబడి, ఏలాటి కఠినపు పలుకులుగాని ఆడక ఆమె సంతోషదినముల కాటంకము గలుగకుండ జూచుచుందురు. నేటి కష్టకాలంలో నిర్భాగ్యజీవుడు ప్రతినిత్యము అదృష్టముతో పోరాడి దెబ్బలు తినుచుండ స్త్రీ మాత్రము సుఖంగా ఉంటున్నట్లు వింటున్నాము.

నిజసంగతులు విచారించిచూస్తే మానవజీవితము ప్రారంభమైనప్పటినుండిగూడ స్త్రీలు పరాధీనత యిలాగే ఉంటున్నదని తెలుస్తుంది. ప్రపంచమునందలి ఏదేశచరిత్ర చూచినప్పటికిగూడ బలవంతులు బలహీనులను నిషేధములవలన అణగద్రొక్కుతు నేయున్నారు. అట్టివాటినుండి బయటబడినవారిలో కడపటివారు పాశ్చాత్య స్త్రీలే. కాని మన ప్రాగ్దేశపు స్త్రీలు పలువిధములగు నిషేధములమధ్య నేను చిక్కుకొనియుండుటేగాక మన జీవితములనే వారు చాలవరకు నడుపుచున్నారు.

కొంతకాలమయ్యేసరికి స్త్రీల విద్యావిధానమే చాలవరకు సంస్కరింపబడి స్త్రీలకు సంరక్షణ అవసరమనియు, అట్టిది కొన్ని నిబంధనలకు కట్టుబడినప్పుడే జరుగుననియు వ్యగ్రరామార్పులతో సిద్ధముగనుండును. చిన్నతనంలోనే సోదరులవద్దనుండి ఆమె వేరుచేయబడుతుంది. సోదరులకందరికి ఇంటివెలుపల స్వాతంత్ర్యముండ యీమెమాత్రము యింటిలోనేయుండాలి. ఈవిధంగానే ప్రారంభమునుండియు స్త్రీ, పురుషులు మనస్సునందును, క్రియలందును వేరుచేయబడిన ఆచారములగూర్చి తలంచుటే చాలా కష్టముగుచున్నది.

బాల్యమునుండియు కూపస్థమండూకముమాదిరి యింటి నాలుగు గోడలమధ్యయుండి బొత్తిగ జ్ఞానశూన్యరాలుగ ఎదిగిన హైందవబాలిక తండ్రికిచెందిన ఆస్తియైయుండి వివాహరూపమున యితరులకు ఒసగబడుచున్నది. అప్పటినుండి చేసుకొన్న భర్తకుచెందిన ఆస్తియై జీవితపర్యంతము భక్తిపురస్సరముగు అతని సేవలో నిమగ్నురాలగును. ఒకవేళ దురదృష్టవశాత్తు యీసమయంలో వైధవ్యము సంభవిస్తే కన్నబిడ్డలకు తలయొగ్గి ఉండాలసివస్తుంది. మతము, కులము, సంఘములు కలసి స్త్రీలను కాపాడి భర్తసంసారము సుఖముగానుండులాగున చేసిన కొన్నినిబంధనల కనుగుణముగ స్త్రీ ప్రవర్తించాలి. ఈ నిబంధనలను మించి ప్రవర్తించిన స్త్రీకి వెంటనే బహిష్కారము జరుగుతుంది. పైచెప్పిన పద్ధతులతో చిన్నప్పటినుండి తయారైన

హైందవనారీమణి యించుమించు పోషణకర్తయొక్క ప్రతిబింబములాగానే తయారౌతుంది. అంతేగాని ఆమె ఏమాత్రం స్వతంత్రఅభిప్రాయములుగల వ్యక్తిమాదిరిగ నేయుండకపోగా ఆమె ఎవరి పోషకవర్గమున ఉండునో వారి కనుగుణ్యముగానే యుండాలనివుంటుంది. ఆమె చేయగలపని బిడ్డలుకనడం. అందు మొగశిశువును కనడమే స్త్రీజీవితంయొక్క మనోవాంఛ. మొగశిశువును కనడమే అన్నిటికన్న ముఖ్యమనేతలంపు అజ్ఞానులగు స్త్రీలలో కలుగుటకు కారణం మన్పుమందుచల్లు మతగురువులే. ఈవిధమైన అనాలోచితకార్యములలో తరతరములనుండి చిక్కుకొన్న స్త్రీలు తమను బంధించు గొలుసులను మరింతదగ్గరకు తెచ్చుకొన్నవారైనారు. ఇప్పుడు అంధకారమునుండి తొలగి వెలుగులోనికి వచ్చుటకు వెనుకముందులాడుచు, నూతన స్వాతంత్ర్యజీవితమునకై ఒకఅడుగు ముందుకువేయుటకు భయపడుచున్నది. కాని కాలచక్రము తిరుగుచున్న కొలదిని గతసంతతివారిస్థానే నూతనరకం స్త్రీలు నేడు జన్మిస్తున్నారు. కొందరుప్రజలు నేటిస్త్రీలు చాలా తీవ్రస్వభావంకలవారంటారు. కాని ఇది నిజమా అని నా సందేహం. ఒకవేళ అది నిజమే అయినట్లయితే అలాఉండటానికి అనేకకారణాలున్నాయి. తరతరములనుండి పరాధీనతలోపడియుండుటవలననే వీరి కిట్టి తీవ్రస్వభావం కలిగియుండవచ్చు. స్త్రీలచరిత్రలో ప్రథమపర్యాయము స్వాతంత్రేచ్ఛయను మత్తుపదార్థపు రుచిని చవిచూచి క్రమేణ అందలి యానందమునుగూడ బొందుచున్నారు. ఈలాటిస్థితిలో ఒకవేళ మన స్త్రీమితము తొలగినను కొలదికాలములోనే మరల తెలివిగలిగి యిదివరకన్న మరింత జాగరూకత కలిగియుండగలరు. నేడు మనము చాలా అయోమయావస్థలోనుండి మానవజీవితమందలి ఆర్థికమార్పులు స్త్రీలకు వ్యతిరేకముగను, వ్యక్తిగతమురాలోచనతోను నిండిన యీకాలంలో నివసిస్తున్నాము. ఇట్టి చిక్కులను స్త్రీలు వ్యక్తిగతంగా ఒక్కొక్కదానిని ఎదుర్కొంటున్నారు. స్త్రీలకు సరియైన విద్యావిధానమువలన నూతన మార్పులు అనేకము జరుగనున్నవి.

ఇప్పటికిని నాగరికత ఎక్కువభాగము పురుషప్రభావముతో గూడుకొన్నది. స్త్రీలుమాత్రము వంటయిల్లు విడిచి కేవలము గృహాలంకరణముగ మారుటకు ప్రయత్నించుచున్నారు. కాని వారినిమాత్రము ఆవిధంగానే యింటియలంకరణవస్తువుగ నుంచరాదు. పురుషునిమాదిరే ఆమెకుగూడ నాగరికతాభివృద్ధి చాలా అవసరము. నేడు ఆమె పోరాడునదంతయు ఒక్క పురుషుల అధిక్యమును తొలగించుటకేనా? నాగరికతలోగూడ స్త్రీ పురుషు లిరువురును సమానముగ పరిగణించబడని నాగరికతకు స్థానమేలేదు గనుక పురుషుని ఆధిక్యతను తొలగించుటకే ఈపోరాటము. వీరుభయుల పరస్పరసహాకారములతో నిర్మింపబడని జాతిలేదని చెప్పాలసిందే. స్త్రీ పురుషు లిరువురుకలసి ఏర్పాటుచేయనిది ఐకమత్యమేలేదనియు, వీరిరువురు ముందుకు నడుముకట్టరానిది స్వాతంత్ర్యమే లభించదనియు చెప్పాలి.

—గా. విజయలక్ష్మి పండిట్.

## దేశాభ్యుదయము ఇంటనుండి ప్రారంభించాలి—

ప్రస్తుతము ప్రపంచమందు కలుగుచున్న నూత్నవికాశము, నవీననాగరకత చాలవరకు గృహధర్మములను, అందలి జీవనవిధానగొప్పతనమును మరుగుపరచుచున్నవి. ఆర్థికదుస్థితి గృహజీవన సౌభాగ్యనాశనమునకు చాలవరకు కారణమైయున్నది. మరియు స్త్రీలు రాజకీయరంగములోనికి దూకుటవలననే దేశాభ్యుదయమునకు తోడ్పడగలరను ఉద్దేశము దేశమంతటవ్యాపించి వృద్ధిచెందుచున్నది. ఇది తప్పభిప్రాయము. స్త్రీలు దేశము యొక్క అభివృద్ధి ప్రథమమున గృహమందే సాధింపగలరు.

ఉమ్మడిజీవనవిధానమందు పెద్దలు పిన్నలందుచూపెడి అధికారముగూర్చి చాలవరకు వినుచున్నాము.

గృహమునంతకు అధికారిణియైన తల్లియందు గృహస్థులందరికి ఒకవిధమైన గౌరవము భయముండెడిది. న్యాయమార్గమున తమఅధికారమును చలాయించుటవలన స్త్రీలు ఈఅధికారవిధానమును చాలకాలమువరకు అనుభవములో పెట్టుటయేగాక, ఎన్నియో లాభకరములగు పనులను సాధించెడివారు. కాని విద్యాలోపములేని నవీన స్త్రీ తన అనుభవమును సరియైనమార్గములో పెట్టుటకు శక్తికలదై యుండవలెను.

—గుమ్మర్ల అహల్యాబాయి.

## వారసత్వపు హక్కులుంటే ?—

పాపమామె ఆచలిలో ప్రతివీధి తిరిగినదిగాని పట్టెడన్నమూ లభించలేదు. చల్లగాలికి పడుకొన్న నేను ఆమెను పరామర్శించాను. ఆమెచెప్పిన సారాంశం ఇది. ఆమెతండ్రి ఒక పెద్దభూస్వామి. తండ్రి ఆమెను పురోహితములోవున్న ఒక ఆస్తికలవానికేయిచ్చి వివాహం చేశాడు. తనాది ఆమెభర్తకు మద్యపానమువలన ఆస్తిపోయి పిచ్చిపట్టినది. ఆయన రెంచ్పటికో పోయినాడు. ఇంతవరకూ ఆయనజాడ తెలియలేదు. యిక ఆమెకు గత్యంతరములేక తనపుట్టినింటికి వెళ్లినది. తండ్రిచనిపోయినాడు. ఆస్తికి అధికారిఅయిన తనఅన్న, దీనత్వమందున్న తన్ను చూడక శూలములకంటె వాడిఅయిన మాటలతో తన్ను అనేకవిధముల బాధపెట్టినాడు. అందుచే ఆమె యీగ్రామమున భిక్షాటనము చేయుచున్నది.

నిజముగా ఒకానొకప్పుడు సమస్తపరిచారికలతో భోగములనుభవించిన ఆమెకు నేడు సుఖభోజనమునకే కరువైనదికదా? తన అన్నవలె తనతండ్రి ఆస్తి నూరవవంతుఅయిననూ లభించకపోగా తండ్రి ఆస్తిలో భోజనముచేయుటకైను ఆమెకు వీలు కలుగలేదుగదా? అట్టియెడ పురుషులతోపాటు స్త్రీలకుకూడ వారసత్వపుహక్కు యిచ్చినచో యిట్టిపాట్లు స్త్రీలకు వుండకపోవును. పురుషులవలె స్వేచ్ఛగా సుఖజీవనముచేయుటానికి వీలుగావుండేదికదూ.

—ఎ. వి. ఎస్. రావు.

## గృహయజమానులు ఛాందసులైతే—

తీరుబడిగానున్నప్పుడు ఏదైనా పుస్తకము చదివితే 'ఏమి చదువులు వచ్చాయి! మే మెరుగమమ్మా! యీచదువులు. మాకాలంనాడు యింత చాకిరీచేసుకోవడము, ఏదో లంకాయాగమో, లేక కుసలాయకమో పాడుకొనడమేతప్ప. ఈ గృహలక్ష్ములని చిత్రగుప్తలని ఎక్కడ వచ్చాయమ్మ! ఆడవాళ్లుకూడా చదవడమేనా?' అని అత్తగారి యారడి. అన్నముముందు కూర్చొన్నతరువాత అన్నము తినవద్దని అంటే ఏలావుంటుందో, చదువువచ్చినవారిని చదువవలదంటే అలానేవుంటుందని వేరే చెప్పవలెనా? నాకు చదువే కాదు, యింకా చాలా ఎన్నోపనులు వచ్చును. ఏమివచ్చిన నేమిఫలితము? వంటతప్ప తక్కినవన్నియు వృథాకదా. పోనీ, భర్తతోనైనా మాట్లాడుదామంటే 'మా నాలుగోఅబ్బాయి పుట్టేవరకూ మాఆయనతో పగలు మాట్లాడమే నే నెరుగనమ్మా ఈచిత్రాలు!' అని సాధింపులుకదా. ఇటువంటి మాటలు వినేసరికి స్త్రీకి సుఖమేలేదా! నావంటివారు ఆంధ్రదేశములో ఎందరోకలరని చాల విచారపడేదానను. మామగారి ఛాందసమే భర్తకుకూడా అలవాటైనది. నేను వివాహముచేసుకొనడమే తప్పనిపించినది. చేతులు కాలిన వెనుక ఆకులుపట్టుకొనిన నేమిలాభము. యిటువంటి గృహములలోవున్న స్త్రీలపనికూడ యింతేయని చెప్ప నక్కరలేదు. నాజీవితమందు సంతోషములేనందుకు గృహయజమానుల ఛాందసమే కారణము. కనుక పదునెనిమిది యిరువై సంవత్సరముల ప్రాయమువరకూ పెండ్లిమానివేసి విద్యనేర్పుకొనిన మంచిదనుకుంటాను.

—కాంతం

# గ్రంథసమీక్ష

## రాష్ట్రగానము

శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు మంచి జాతీయాత్మగల కవి. మహాత్ముని ఆత్మకథను పద్యకావ్యముగా విరచించుటలోనే వీరి జాతీయాభిమానము ఆంధ్రలోకమునకు సువిదితమైనది. ఈ కవివరునకు తల్లిభాషపైగల ప్రేమ అగ్గలము. తెలుగు పలుకుల నేర్చికూర్చుటలో కవిబ్రహ్మ అనుగుజాడల నడచెదనని బాసచేసి యా విధముగనే ఆత్మకథను విరచించి వీరు విద్వత్కవుల ప్రశంస లందికొనిరి.

మాతృభాషపైవలెనే మాతృదేశముపైగూడ వీరికి అభిమానము మెండు. తెలుగువారందఱొక్క తల్లిబిడ్డలవలె నేకముగావలయుననియు, తెలుగునాడంతయు నొక ప్రత్యేకరాష్ట్రముగా నేర్పడవలయుననియు, తెలుగులప్రతిభ దిగంతవ్యాప్తము గావలయుననియు, వీరి యాశయము. అయినను రాష్ట్రీయ దురభిమానముతో అఖిలభారత జాతీయాభ్యుదయ కార్యముల యెడ సంకుచితదృష్టిజూపు మహాంధ్రభక్తులలో వీరెంతమాత్రము చేరజాలరు. ఉమ్మడికాపురపు వత్తిడినుండి వైదొలంగి తెలుగు ప్రజలెల్లరు మాతృభారతీ దాస్యవిమోచన క్రియాసమారంభమున నగ్రతాంబూల మందుకొన వలయుననియే వీరి మహదాశయము.

జాతీయములగు చక్కని విషయములను కాలోచిత మగుభంగి కవితా వస్తువులుగాచేకొని పద్యము లల్లుటలో నీ కవివరునకుగల ప్రతిభ అప్రతిమానము. కావుననే ప్రత్యేకరాష్ట్రము గావలయునని తెలుగునాడంతట ప్రబలమగు నాందోళన జరుగుచున్న నీ సమయమున వీరు ఆంధ్రులనెల్లర ప్రబోధించు 'రాష్ట్రగానము' అను నీపొత్తమును వెలువరించిరి. 'హెచ్చరిక', 'కైవారము', 'రాష్ట్రగానము' అను శీర్షికలక్రింద వీరు విరచించిన పద్యములెంతయు భావపూరితములై తెలుగుసైదోడుల డెందముల నైకమత్యమును ప్రత్యేక రాష్ట్రాభిమానమును నుద్దీపింప జేయునవిగానున్నవి. ఇందలి ప్రతియొక్క పద్యము మనోహరమై దేశభక్తిభావభరితమైయుండుటచే మచ్చునకతేరి చూపుట కష్టమే యైనను, యావదాంధ్రదేశము రాయలసీమయే యని నిరూపించుటకును, పశ్చిమాంధ్రులయెడ తూర్పుతీరాంధ్రుల కేనాడును భేదభావము లేదని తెల్పుటకును వీరు విరచించిన పద్యముల రెండీ పొత్తమునుండి యుదాహరింతును.

నాటలేదే కొండవీటిఖిల్లామీఁద
　　శత్రుభీకరమైన జయపతాక
ఆంధ్రవిష్ణుపదంబు లర్చించికాకుళ
　　క్షేత్రమందాముక్త సెప్పలేద
గోదావరీ నిర్మలోదక స్నాతుఁడై
　　కోనసీమను మెచ్చుకొనఁగలేద
సింహాద్రినరసింహు చెంత నుత్తాలమౌ
　　దిగ్జయస్తంభ మెత్తింపలేద
అకట పూర్వాంధ్రమున రాయలాక్రమించి
యాదరింపనిగడ్డ కొసంతకలద
ఇదియు రాయలసీమ గాకేమియగునొ
వెల్లడింపుడు కృతబుద్ధు లెల్లగూడి.

తలదాల్పలేద విద్వత్సార్వభౌముని
　　కట్టమంచికులాబ్ధి కైరవాప్తు
మన్నింపలేద రామారాయణింగారి
　　సాచివ్యమును సుప్రశంసలిచ్చి
ఆడలేదా కృష్ణమాచార్యకృతములై
　　నీటుగుల్కెడి పెక్కు నాటకముల
సకలవేదాంతవేత్త కొసంగలేద రా
　　ధాకృష్ణునకు జయధ్వానములను
ప్రతిభగలవారి మీవారి నతికరించి
త్రోసిపైచిర యెపుడేని తూర్పువారు
సందియములేల రండు బుజాలుగలిపి
చేయవలెనాంధ్రరాజ్య లక్ష్మీప్రవతంబు.

ఇట్టి పద్యరత్నములతో నిండిన యీ 'రాష్ట్రగానము' నాలుగణాలు వెలను కలిగియుండుట యెక్కువ విషయము గాకపోయినను కొంచెము భారమనిపించుచున్నది. యావదాంధ్రులు కంఠస్థముచేయదగిన పద్యములుగల యీ పొత్తము వెల స్వల్పముగానుండి విదులకెక్కువ నవకాశమిచ్చునదిగా నుండుట లెస్సయనుకొందును. రాష్ట్రగానము తెలుగుసీమయే యంతటను వ్యాపించి తెలుగుల ప్రత్యేక రాష్ట్రాభిలాషనితోధిక మొనర్ప తోడ్పడగలదని నమ్ముచున్నాను.

కనుపర్తి వరలక్ష్మమ్మ.

ఆధారములు

(కథల సంపుటి)

రచయిత శ్రీయుత జనస్వామి కోదండరామ శాస్త్రిగారు, లక్ష్మిప్రెస్, తెనాలి. ప్రతి వెల 0_6–0.

ఇందులో రెండు భాగములు గలవు. మొదటి భాగమున నాలుగును, రెండవభాగమున ఐదును కథలు గలవు. రెండవ భాగమందలి కథలు ఇదివఱకు వాహినియందు ప్రకటింపబడినవి; కర్షక కార్మిక సమస్యలకు సంబంధించినవి.

సంఘమునందలి జరుగు నన్యాయముల నాధారములుగా గొని మొదటిభాగమునందలి కథలన్నియు వ్రాసినందున కథలసంపుటి కా పేరిడిరి. కథలన్నింటికిని సాధారము సంఘజీవితమైయుండ ప్రత్యేకముగ నీ పేరిడుటలో ప్రత్యేకత గోచరించుటలేదు.

కథలందు కన్నీటికెరటాలు అనునది మాత్రము సుమారుగనున్నది. మిగిలినవి కథలనుటకన్న ఉపన్యాసములనుట మేలు. రచయిత తనయుద్దేశముల వ్యాసరూపమున వ్రాసియున్న బాగుండెడిదేమో? కథలని పేరిడి, అది యారంభముననే మరచి రచన సాగించినటుల గనపడుచున్నది. భాషయు నిటు గ్రాంథికముగాక, వ్యావహారికముగాక సంకరమై అస్వాభావికమైనది.

సాహిత్యకల /

రచయిత శ్రీయుత సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్య శాస్త్రిగారు, సూర్యారావుపేట, కాకినాడ. క్రౌనుసైజు 154 పుటలు. వెల 0–8_0.

ముఖ్యముగా నీ శతాబ్దారంభమునుండియు ఆంధ్రసారస్వతము నూతనత్రోవ త్రొక్కినది. రచనావిధానము స్వాతంత్ర్యపద్ధతుల నవలంభించి యథేచ్ఛముగ సాగుచువచ్చినది. భాషావిషయమై పట్టుదల వదలినది. వస్తువునుగూర్చిన సనాతనత్వము వదలిపోయినది. ఈమార్పు, ఈనవీనత, యీ స్వాతంత్ర్యము దుర్వ్యయముచేసి కొంత అసభ్యరచనకూడ బైలువెడలుచు వచ్చినది.

అనాదినుండియు నియమనిబంధమై వచ్చుచుండెడి రచనావిధాన మటులనే సాగనివ్వవలయుననెడివారు గూడ లేకపోలేదు. వారల కీ నవీనత, మార్పు, స్వాతంత్ర్యము ఎదురుచుక్క. అందుచే ఆధునిక ఆంధ్రసారస్వతప్రపంచమున రెండు పక్షము లేర్పడినవి. రచయితగారు ఈపక్షమునకు చేరినవారు.

నేటి రచనలలోని నవీనతయెడ వీరికి గౌరవము లేదు. దానిపై ఇప్పుడు బైలుదేరెడి అసభ్యవ్రాతలు వీరి కెక్కుడు నాగ్రహమును దెచ్చినట్లు గన్పడుచున్నది. అందుచే నీగ్రంథమున సహృదయులు మన్నింప సాధ్యముగాని విషయము లందందు జొచ్చినవి.

రచనావిధానము నీతినియమనిబద్ధమైయుండవలెననియు, సనాతనపద్ధతియే భావ్యమైనదనయు, నూతనపద్ధతుల నవలంభించుటచే సారస్వతమును, దానివలన సంఘమును క్షీణించుననియు గ్రంథకర్త పెక్కుమంది అభిప్రాయములను జూపుచు వ్రాసిరి. అభిప్రాయభేదములున్నను ఇందలి ఆదర్శములలో నెక్కువ

భిన్నత ఎవరును చూపజాలరు. ఆదర్శసిద్ధికి అవలంబించెడి విధానములతో మాత్రము నేటి రచయితలు అంగీకరింపకపోవచ్చును.

అభిప్రాయములను నిరాటంకముగా వెల్లడించుటలో సర్వస్వాతంత్ర్యము దీసికొనవచ్చును. కాని ఇతరులను విమర్శించునపుడు వారికి తగిన గౌరవము నిచ్చుట ఉత్తముల పద్ధతి. ఇందు గ్రంథకర్తగారు అసభ్యవ్రాతలను ఉదహరించుచు వ్యక్తిదూషణను గూడ వెనుదీయకుండుట చింత్యనీయము. ఇంతకును ఊరు పేరులులేనివారే పత్రికయందో అసభ్యపు వ్రాతల వ్రాయుదురేని అదియే నవ్యసాహిత్యపు వ్రాతల కుదాహరణము కాజాలదు. అవి గర్హింపదగినవేగాని, అందలి జుగుప్సాకరములై పాఠకుల కసహ్యమును గల్గించు విషయములను పలుమారు ఉదహరించుచు, ఆయా రచనలను, రచయితలను, అభిప్రాయభేదములను వెల్లడించినవారినికూడ నదేపనిగా తిట్టుట సమంజసముగాదు. ఉత్తమరచయితల మార్గము గాదు. —ల. కా.

## భగవద్గీత

తెలుగువచనము. రెండువందల సంవత్సరముల క్రిందట తుపాకుల అనంతభూపాలుని చేత తెనిగింపబడినది. దీనిని విశాఖపట్టణము జిల్లా, ఎలమంచిలి గీతా ప్రచార పరిషత్తువారు ప్రకటించి యుచితముగా పంచిపెట్టుచున్నారు. రెండణాల తపాలబిళ్లల కొరకు ప్రతి పంపబడును. ఒక్కొక చిరునామా కొక్కొక ప్రతియే పంపబడును. ప్రతులకు పై పరిషత్తుకుగాని 'ఆంధ్రభూమి', తేపేరిపోస్టు, మదరాసుకుగాని వ్రాయగలరు.

## రైతు ఋణవిమోచన చట్టము

ఇందు జాయింటు సెలెక్టుకమిటీ నివేదిక, రివైజు చేయబడిన పూర్తివివరములు గలవు. వెల ఒకణా. ప్రకాశకులు చీప్ బుక్ డిపో, 2/16, మవుంట్ రోడ్, మద్రాసు.

## దయాల్బాగ్

ఇది రాధాస్వామీసత్సంగముయొక్క పారమార్థిక విద్యాపారిశ్రామిక సంస్థల సంగ్రహ చరిత్ర. ఆంధ్ర రాధాస్వామి సత్సంగసంఘమువారిచే కాకినాడలో ప్రచురింపబడినది. వెల 0-2-0.

పందొమ్మిదవ శతాబ్దమధ్యమున స్వామీజీ మహరాజ్ రాధాస్వామి సత్సంగమతమును ఆగ్రాయందు స్థాపించిరి. వారి మతసిద్ధాంతములు మూడు; ఈశ్వరాస్తిక్యము, మరణానంతరము జీవుని యవినాశస్థితి, జీవైశ్వరైక్యత. మతాచార్యులలో నైదవవారగు సాహబ్జీ మహారాజుగారు 1915-వ సం.మున ఆగ్రా సమీపమున నాలుగొకరముల నివేశస్థలమును సంపాదించి యీసంస్థను ప్రారంభించిరి. అది క్రమక్రమముగా వృద్ధిపొంది, విద్యా, పారిశ్రామిక, వ్యావసాయకశాఖలతో 3000 ఎకరముల భూమిలో 3500 మంది నివాసులతో విరాజిల్లుచున్నది. ఈ సంస్థనుండి 1936—37-వ సంవత్సరము ఎగుమతియైన సరుకుల విలువ రు. 10,51,730లు!

ఇందు వర్ణ, స్త్రీపురుష వ్యవస్థలేక సకల విద్యలు నేర్పబడుటకు గావలసిన కళాశాలలు, విద్యార్థులకు తగిన వసతిగృహములు గలవు. ఇచట తయారుచేయబడని వస్తువేలేదు. ఎందునుగాని పాశ్చాత్యులకు భారతీయులు తీసిపోరనుటకీ సంస్థయు, నిందలియు కృషియు నొక నిదర్శనము. బైటిప్రపంచములో నవసరములేకనే అధునికపద్ధతులలో నన్ని సౌకర్యములను భారతజాతి కొసంగ ప్రయత్నించుచున్న నీ సంస్థ ప్రముఖులచే ప్రశంసింపబడుట వింతగాదు.




## పురపాలక ఎన్నికలు-స్త్రీలు

ఈ రాష్ట్రమున పురపాలక వర్గములకు ఎన్నికలు జరిగినవి. ప్రతిచోటను కాంగ్రెసు అభ్యర్థులు పోటీచేసిరి. ఎనుబదికి పై బడిన పురపాలకవర్గములలో ముప్పాతికభాగము మెజారిటీని సంపాదించిరి. జయమందిన వారి నెల్లర నభినందించుచున్నాము. వీరు కాంగ్రెసోద్యమ వ్యాప్తికై పాటుబడెదరని విశ్వసించుచున్నాము.

ఈ ఎన్నికలందు నిలిచిన స్త్రీ అభ్యర్థులను గూర్చి ప్రత్యేకముగ వ్రాయవలసిన ఆవశ్యకత కొంచము గలిగినది. పురపాలక చట్టప్రకారము ప్రతి పురపాలకవర్గమునందును అధమపక్షమొక స్థానమైనను స్త్రీలకు ప్రత్యేకింపబడినది. దానికేగాక ఇతర స్థానములకుకూడ స్త్రీలు నిలువవచ్చును. దీనికి చట్టమెట్టి యాటంకమును పేర్కొనలేదు. ఈ ఎన్నికలందు కాంగ్రెసువారు ప్రత్యేక స్థానములకు మాత్రము స్త్రీలను నిల్పిరి. జనరలు సీట్లకొక్కరినిగూడ నిలుపరైరి. అంతియగాదు. కాంగ్రెసుమెజారిటిగల ఎచటగాని పురపాలకాధ్యక్ష లేక ఉపాధ్యక్ష పదవి కొక్కస్త్రీనికూడ నిలుపరైరి.

ధనవంతులై స్వార్థమునకై ఎన్నికలకు ముందుగా కాంగ్రెసు సభ్యులైన మహాశయుల నెందరినో పురపాలక ఎన్నికలకు కాంగ్రెసు వారభ్యర్థులనుగా నిల్పినారు. ఇప్పటికెన్ని సంవత్సరములుగానో కాంగ్రెసు ఆజ్ఞ తలదాల్చి ఎంతో త్యాగమును జూపి కారాగారవాసమును కూడ అనుభవించియున్న మహిళామణు లెంతమందియో గలరు. మేకతోలు గప్పుకొని తమ పొట్టనింపుకొన కాంగ్రెసుజొచ్చిన వారికంటె యీ త్యాగధనులైన స్త్రీల భ్యర్థులుగా నుండుటకు అర్హులుగాక పోయిరా? లేక వీరి నభ్యర్థులుగా కాంగ్రెసు వారు నిలుపకపోవుటకు కారణమెయ్యది?

స్వార్థపరు లెక్కువగనుంటవలన మండల కాంగ్రెసువర్గము లిట్టి యన్యాయములకు పూనుకొనవచ్చును. దానిని గమనించి తగురీతి ప్రవర్తింపక రాష్ట్రీయ కాంగ్రెసుకమిటీలును వర్కింగ్ కమిటీయును కనులుమూసుకొనియున్నచో గతియేమి? కాంగ్రెసుకొరకై స్వార్థమును బలియొసగిన వారిని తగినరీతి గణింపక స్వార్థమునకై కాంగ్రెసు అండజొచ్చినవారిని గౌరవించుచున్నచో కాంగ్రెసు ఉద్యమున కెంతఘనత చేకూరునో తంజావూరు చిత్తూరు మొదలగు పురపాలక వర్గములందు కాంగ్రెసునకు గలిగిన కళంకము తెలుపుచున్నది.

ఎన్నికలకు ధనము అవసరముగావచ్చును. కాని త్యాగ సత్య శీలములుగల కాంగ్రెసు అభ్యర్థు లింతకంటె అవసరము. వారిలో స్త్రీలకు తగిన ప్రాతినిధ్యముండుట మరియు నవసరము. నాయకులిది గమనించి ఇకపై నిట్టి అన్యాయములు గలుగకుండ శ్రద్ధ వహింతురని కోరుచున్నాము.

*　　*　　*

వర్కింగ్‌కమిటీ నిరంకుశత్వము

ఆంధ్రులభివృద్ధి పొందుచున్నారని మురిసెదము. కాని ఆంధ్రులన్న తృణప్రాయము, ఆంధ్రాశయములు అపహాస్యములు; ఆంధ్ర రాష్ట్రము అడియాశ. ఇది అసలుసంగతి.

పాతికసంవత్సరములుగా ఆంధ్రులందరైక్యకంఠముతో ఆంధ్రరాష్ట్రము గావలయునని ఘోషించుచున్నారు. దానికై నిరంతర కృషిచేయుచుండియు అఖిలభారత సమస్యల నెదుర్కొనవలసివచ్చినప్పుడంతయు తమ యాశయములను గమనింపక త్యాగబుద్ధితో నాయకుల ననుసరించి వానికై పాటుబడినారు.

నిరంకుశత్వమును నెరపు వర్కింగ్‌కమిటి ఆంధ్రుల త్యాగములను మరచినది. అంతియగాదు వారిని తృణీకరించినది. వారిచే గా. సాంబమూర్తిగారికి గలిగిన గౌరవమే దీనికి నిదర్శనము.

ఇంగ్లండు వెడలుటవలన లాభమో నష్టమో ముందే తీర్మానించి గా. సాంబమూర్తిగారికి తెలుపవలసియుండెడిది. అటులగాక వెళ్లుటకు తగిన పైకముకూడ ప్రభుత్వము శాంక్షనుచేసిన తరువాత నిలుపడమెందుకు?

అసలు పైకముశాంక్షను చేయకమునుపే గా. సాంబమూర్తిగారు ఇంగ్లడు ప్రయాణము మానుకొనవలెనని గాంధీగారు గా. సి. రాజగోపాలాచారిగారికి వ్రాసిరనియును యుత్తరముచేత నుంచుకొనియే వారు శాసనసభయందు ప్రయాణమునకు పైకము శాంక్షనుచేయించినాటకమాడిరనియు 'ప్రజామిత్ర'యుం 'ఆకాశవాణి' తెలుపుచున్నారు. ఈ కుంభకోణమే నిజమగుచో నాంధ్రులన్న ప్రధానిగారికి ఎట్టి గౌరవముగలదో ఊహింపనగును.

ఇట్టి కుంభకోణమును జరిగించిన రాజాజీగారు బైటబడ లేదుగాని గా. సాంబమూర్తిగారు మాత్రము 'ఫేలుపోయి'నారు. పైగా వారు ఆంధ్రరాష్ట్రోంద్యోళనకై కృషిచేయుదునని తన రాజీ నామానంగీకరింపవలెనని వర్కింగ్‌కమిటీతో మొరపెట్టగా 'అటుల చేయుటకు వీలులేదు. మేమది అంగీకరింపము. మీరు కాంగ్రెసులో నున్నంతకాల మీపద్ధతి సాధ్యముగాదు' అని నిర్దాక్షిణ్యముగా నిరంకుశత్వము నెరపినది వర్కింగ్‌కమిటి. అంటే కాంగ్రెసునుండి విరమించుకొని గా. సాంబమూర్తిగారు గాదు ఏ మూర్తిగారైనా యేమియుచేయజాలరు. అది యందరెరిగినదే.

ఇంతకు మాఉద్దేశము కోట్లకొలది ప్రజలయాశయములను నాయకులు గౌరవమర్యాదలతో మన్నింపవలయుననియే.

EDITED BY DR. K. N. KESARI. PRINTED AND PUBLISHED
BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

ధరసింహాసనమై నభంబుగొడుగై తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయములెల్ల వందిగణమై బ్రహ్మాండమాకారమై
సిరిభార్యామణియై విరించికొడుకై శ్రీగంగసత్పుత్రియై
వరలున్ నీఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా!

బమ్మెరపోతన ?